B. [illegible]

నిత్యజీవితంలో

# కలలు ఫలితాలు



2

సంకలనం :

శ్రీమతి గుడిపాటి ఇందిరాకామేశ్వరి

భరణి పబ్లికేషన్స్
28-20-17/4, జానీ వీధి, అరండల్‌పేట,
విజయవాడ - 520 002.

# నిత్య జీవితంలో
# కలలు - వాటి ప్రభావం

ప్రపంచ ప్రఖ్యాత మనోవైజ్ఞానిక నిపుణుల అభిప్రాయం ప్రకారం ... ప్రతి వ్యక్తీ కలలను కంటారు. రోగులతో సహా అందరికీ కలలు రావడం సర్వసాధారణం! స్త్రీ, పురుషులు వయోభేదం లేకుండా ఆబాలవృద్ధులు సైతం కలలు కంటారు. కేవలం మానవులు మాత్రమే కాదు, ప్రతి పక్షీ, ప్రతి జంతువూ, ప్రతిప్రాణీ కలలుగనడం అతిసహజం! సింహస్వప్నం అనేమాట అలా పుట్టినదే! ఏనుగు కలలో కూడ సింహానికి భయపడుతుంది(ట).

జంతువులు మాత్రమే కలలకు భయపడతాయా ?... కాదు! కలలపట్ల భయం అనేది మానవులకూ వుంది. అనాదిగా వుంది. అందుక్కారణమేమిటంటే.... అన్ని కలలూ శుభఫలితాలనే కలుగ చేయవు. చాలా కలలు... అందులోనూ ముఖ్యంగా పీడకలలు కలిగించే అశుభఫలితాలకు భయపడని వ్యక్తి అరుదు. బహుశా ఈ భయమే మనిషికి కలల ఫలితాన్ని విశ్లేషించాలనే పరిశోధనకు పురిగొల్పి ఉండొచ్చు! ప్రాచీన శాస్త్రకారుల నుంచి నవీన పరిశీలకుల వరకూ పెక్కుమంది ఎన్నో ఆధారాలతోను - ఋజువులతోను కలలను విశ్లేషించి చూశారు. చాలాకాలంపాటు వివిధ సందర్భాలలో వచ్చిన కలలను - వాటి పరంగా నిజజీవితంలో జరిగిన సంఘటనలను ఆచితూచి శాస్త్రీయంగా నిర్ధారించారు.

ఈ విధంగా కాలప్రమాణానికి నిలిచిన ఫలితాన్నే మేము ఈ పుస్తకంలో పొందుపరిచి పాఠకలోకానికి సమర్పిస్తున్నాం!

మీ
- పబ్లిషర్స్

# విషయసూచిక

పేజి నెం.


1. సాధారణ శుభసూచక స్వప్నాలు 5

2. ప్రకృతి సంబంధమైనవి : 6
(సూర్యుడు, చంద్రుడు, భూమి వగైరా)

3. జల సంబంధమైనవి : 9
(సముద్రం, నది, కాలువ మొ.వి)

4. పక్షి సంబంధమైనవి : 11
(నెమలి, చిలుక, పావురం వగైరా)

5. జంతు సంబంధమైనవి : 14
(ఏనుగు, సింహం, పులి మొ.వి)

6. వృక్ష సంబంధమైనవి : 18
(తాటిచెట్టు, మర్రి, తోట మొ.వి)

7. గృహ సంబంధమైనవి : 21
(పొయ్యి, దీపం, నెయ్యి, నూనె వగైరా)

8. మనుష్య సంబంధమైనవి : 24
(వివిధజాతులు-రకములు మొ.వి)

9. ఆహార సంబంధమైనవి : 28
(వివిధ పదార్థాలు - పానీయాలు వగైరా)

10. బంధు సంబంధమైనవి : 30
(అత్త, అక్క మామ మొ. వరసలు)

11. నానావిధ (అవర్గీకృత) కలలు 34

12. అశుభసూచక స్వప్నాలు... 45

13. కలల ఫలితాలు ముగించే ముందు.... 48

# సాధారణంగా కన్పించే
# శుభ సూచక స్వప్నాలు

**సూ**ర్యోదయం, చంద్రుని బింబం (సంపూర్తిగా), నక్షత్ర దర్శనం, నదుల్లోగాని, సముద్రంలోగాని స్నానం చేసినట్లుగాను, తెల్లని వస్త్రములు ధరించినట్లుగాను వచ్చు కలలన్నీ శుభ సూచకములు.

దేవాలయ దర్శనం, ఏనుగును ఎక్కుట, సింహముపై ఎక్కి సంచరించుట, పర్వతం కలలో కనిపించడం రాజభవనాలు, అంతఃపురాలను చూచుట లేదా అందు ప్రవేశించుట, ఆకాశంలో విహరించునట్లు కలగనుట.... ఇవన్నియూ మంచికలలు.



రాజు, రక్తం కలలో కన్పించినా, పాలను కలలో చూచినా, రత్నాభరణాల్ని ధరిస్తున్నట్లు కలగన్నా, జ్వలించే అగ్నిని చూసినా, పద్మములను, గోధుమలను చూసినా విశేష శుభం కలుగుతుంది.

ఇంకా...

అగ్నిజ్వాలల్లో చిక్కుకున్నా, రక్తం తాగినట్లుగా కలగన్నా, కల్లుత్రాగినా, శ్రీ చందనం, అద్దం, మాంసం, రకరకాల పుష్పాలు, దేవతలను కలలో కనిపించినా ధనలాభం.

చిత్రంగానే ఉన్నప్పటికీ... తేళ్ళు, పాములచే కరవబడినా, తామరాకులో నెయ్యితో కూడిన పాయసం భుజించినా, తాను వధించబడినట్లు కలగన్నా, మరణంగాని, ఏడ్పులుగాని కలలో కనిపించినా శుభం. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే!

ఈ గ్రంథలో ఇంకా ఇటువంటి విశేష ఫలితాలు చాలా ఉన్నాయ్.



# 1. ప్రకృతి సంబంధమైనవి

**సూర్యుడు :** సూర్యుడు, సూర్యకాంతి, ప్రకాశవంతంగా కన్పించేతీరు... వీటి మధ్య వైరుధ్యాలను బట్టి కలల ఫలితాలు మారుతూంటాయి.

★ తెల్లని వెలుగులు వెదజల్లుతూ సూర్యుడు ఆకాశంలో కన్పిస్తే, అటువంటి కలగన్న వారికి త్వరలో మంచిరోజులు రానున్నట్లు గుర్తు.

★ ఆకాశంలో సూర్యుడు జరజరా పైకి ప్రాకిపోతున్న రీతిలో కలరావడం అంత గొప్ప ఫలితాన్నివ్వదు. పైగా ఈ సూర్యుడు అలా - అలా మబ్బుల్లోకి పోయినట్లు కలవస్తే మీకు కష్టకాలం చేరువ అవుతున్నట్లు గుర్తు.

★ సూర్యుడు పసిడివర్ణపు ఛాయతో ఉదయిస్తున్నట్లుగా... అనగా లేలేత కిరణాల బాలభానుని మీరు కలగంటే, మీ జీవితంలో మరపురాని సంఘటన జరుగుతుందని అర్థం.

★ అయితే... సూర్యబింబం రక్తంముద్దలా మాత్రం కన్పించరాదు. అది కష్టాలను సూచిస్తుంది. వ్యవహారాలలో అపజయం కలుగుతుంది.

**చంద్రుడు :** సూర్యుడు కలలో కన్పించేరీతికి విశేష ఫలితాలున్నట్లే, మానవ జీవనగతిని శాసించే గ్రహాలలో చంద్రునికీ ప్రాముఖ్యత ఉంది. జ్యోతిష్యశాస్త్రంలో భవిష్యత్తు చెప్పాలన్నా, గోచారఫలాలు చెప్పాలన్నా చాంద్రమానం - సౌరమానం రెండూ పరిగణనలోకి తీసుకోవడం మనకు అనుభవంలో ఉన్నదే!

★ నీటిలో చంద్రుని ప్రతిబింబం చూడడం తటస్థించిందనుకోండి! మీరు ప్రయాణాలు చేస్తారన్నమాట! ఇదే నెలవంకను నిర్మలమైన ఆకాశంలో దర్శిస్తే మీకు ఒకటీ - రెండూ కాదు... వరసగా ప్రయాణాల పరంపర తథ్యం! అంటే - ఎక్కువగా ప్రయాణిస్తారని అర్థం.

★ నిండు పున్నమినాటి చంద్రుణ్ణి కలలో చూడగలిగితే అన్నివిధాలా శుభం జరుగుతుందని గమనించండి! అదే మబ్బుల్లో చందమామను చూస్తే, మీ జీవితం కొంతకాలం ఆశించినంత బాగా వుండదని అర్థం!

★ చంద్రుడు క్షీణిస్తున్నట్లు కలగన్నా, ఆకాశమార్గాన చంద్రుడు జరజరా పారిపోతున్న రీతిలో కనిపించినా శుభఫలితాలుండవు. అయితే భారీ నష్టాలు కూడా ఉండవని గమనించండి!

భూమి : మనం నివశించే భూమి సూర్యచంద్రాదులవలె ఒక గ్రహ విశేషమే! అయితే ఇది మనకు కలలో కనిపించే తీరుమీద ఆధారపడి ఫలితాలు ఉంటాయి. శుభాశుభ మిశ్రమ ఫలితాలుండొచ్చు!

★ సమతలంగా, చక్కగా చదును చేయబడి అలంకరించబడినట్లున్న భూమి కనిపిస్తే త్వరలో మీ ఇంట శుభకార్యం, సంతానయోగం ఉండొచ్చు!

★ రంగవల్లికలతో సహా కనిపిస్తే సిరిసంపదలు ప్రాప్తి.

★ భూమిని మీరు దున్నుతున్నట్లు, పంటవేసినట్లు కలగనడం కుటుంబంలో సుఖ సంతోషాలను సూచిస్తుంది. కాని.... భూమి బీటలు వారినట్లు, నెర్రెలిచ్చినట్లు కల రారాదు. అది దుర్వార్తా సూచకం.

★ మీరున్నంతవరకు భూమి కంపించినట్లు కలరావడం వరకూ మంచిదే! రోజువారీ (నిత్య) జీవన గమనంలో మార్పులు జరిగి పరిస్థితులు సానుకూలమవుతాయి. కాని, భూకంపంలో మీరు గాయపడినట్లు కలవచ్చిందా ఇక అంతే! కొన్నాళ్ళవరకూ మీరు విపత్కర పరిస్థితిని దాటలేకపోవచ్చు!

★ భూభాగం కొద్దిగాను - అడవిభాగం అధికంగాను కన్పిస్తే మీ జీవితంలో ఆశ్చర్యకరమైన ఘటనలు జరుగుతాయి.

★ ఆ అడవిలో ఎవరో మిమ్మల్ని తరుముతున్నట్లుగాని; కొట్టడానికి వచ్చినట్లుగాని కలవస్తే జ్ఞాతులు లేదా అధికారుల మూలంగా చిక్కులు ప్రాప్తిస్తాయి.

★ అడవిలో మీరు బిక్కుబిక్కుమంటూ ఒంటరిగా ఉన్నట్లు కలవస్తే, మీరు మీకు వ్యతిరేకమైన సమాచారాన్ని వినవలసి వస్తుంది.

★ ఏదైనా సువిశాలమైన మైదాన ప్రాంతాన్ని మీరు కలలోచూస్తే, భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుంది. సుఖసంతోషాలకు చేరువ కాగలుగుతారు.

★ కాని... మైదానానికి బదులు ఎడారిభూమి మీరు కలలో దర్శించినట్లయితే ఒంటరి పోరాటంతో కూడిన నిస్సారమైన జీవితం గడపవలసి వుంటుంది.

★ పర్వతం కలలో కనిపిస్తే సామాన్య ఫలితం. అగ్నిపర్వతం మీ కలలో కనిపిస్తే, ఇతరులు మిమ్మల్ని చూసి ఓర్చుకోలేక పోతున్నారని అర్థం. అయితే - ఆ పర్వతంలోంచి లావా ప్రవహిస్తున్నట్లు కలరావడం మీకు ఆరోగ్యభంగం.



# ప్రకృతి దృశ్యాలు

సూర్యచంద్రులు, పర్వతాలు, భూమి ప్రకృతిలో భాగాలే అయినప్పటికీ - ఇవన్నీ విడివిడిగా కనిపించడం వేరు, ఒక ప్రకృతిదృశ్యంగా కనిపించడం వేరు. ఫలితం కూడా విభిన్నంగా ఉంటుంది. మొత్తంమీద అన్నీ కలిసిన ప్రకృతి దృశ్యం స్పష్టంగా కలలో దర్శించినపుడు, మీ భవిష్యత్ జీవితంలో సుఖశాంతులుంటాయని సూచన. అది అస్పష్టంగాను- అలుక్కుపోయినట్లు గాను ఉంటే కొద్దికాలం కష్టనష్ట ప్రాప్తి అని గ్రహించాలి.

**మేఘాలు :** మబ్బులు నల్లగా కమ్ముకొని వచ్చినట్లు కలగంటే కష్టాలూ కమ్ముకు వస్తాయి. తెలిమబ్బులు దూదిపింజల్లా తేలే మేఘాలు కలగంటే, మీకు ఇంతకాలం వున్న కష్టాలు తొలగిపోయి, మంచిరోజులు వస్తాయని అర్థం.

**ఇంద్రధనుస్సు :** వ్యవహార జయం విషయంలో ఇంద్రధనుస్సు కలలోకి రావడం అనేది చాలా గొప్ప శుభపరిణామానికి సంకేతం. చాలారోజులుగా అపరిష్కృతంగా ఉన్నవి సైతం శత్రువు రాజీకి రావడంతో అనుకూలిస్తాయి.

**తోకచుక్క :** సహజంగానే తోకచుక్క కనిపించడం అశుభ పరిణామం. దుర్వార్త వినడంగాని, ఇతరులవల్ల మీకు ప్రమాదం కలగడంగాని, తోకచుక్క కలగనడం ద్వారా సంభవించవచ్చు!

**ఉల్క :** ఆకాశం నుంచి గ్రహశకలాలు గాని - ఉల్కలు గాని రాలినట్లు కలవస్తే శుభసూచకమని అనుభవంలో తేలింది. కోరుకున్నవి లభించవచ్చు.

**గ్రహణం :** సూర్యగ్రహణంగానీ, చంద్ర గ్రహణంగానీ ఏది కలలో కన్పించినా అశుభమే! ఇవి రెండూ మాతాపితరుల ప్రాణసంకటాన్ని సూచిస్తాయి. అలాగే సూర్యచంద్రులిద్దరూ ఒకేసారి కన్పించరాదు. అది అశుభం.

**మెరుపు :** ఉరుములతో కూడిన మెరుపులను కలగంటే మీరు ప్రమాదంలో ఇరుక్కుని చాలా ప్రయత్నంమీద గట్టెక్కగల్గుతారని అర్థం!

**వెలుగు :** వరుసగా ఎన్నోదీపాలు వెలుగుతున్నట్లు కలవస్తే మీరు పట్టిందల్లా బంగారం అవుతుందని గ్రహించండి. గొప్ప వెలుతురు మీకు కలలో కనిపిస్తే చేపట్టిన కార్యక్రమాలు సానుకూలమవుతాయని అర్థం.

**నీడలు :** ఏ వస్తువులకైనా ఏర్పడిన నీడలు మాత్రమే కలలోకి వస్తే మీరు నిరంతరం భయంతో కొంతకాలం గడుపుతారు. తరచుగా నీడలు కలలోకి వచ్చినా,



అస్పష్టంగా ఏవేవో కదలాడినట్లు కలగన్నా ఊహలు – భ్రాంతుల్లో కొంతకాలంపాటు తేలియాడుతూ బోల్తాపడటం, పనుల్లో అనవసరంగా జాప్యం జరుగుతుంది.

## 2. జల సంబంధమైనవి

జలవనరుల జాబితాలో సముద్రం నుంచి పిల్లకాలువ వరకు నీటి ప్రవాహానికి సంబంధించినవన్నీ చేరతాయి. వీటికి సంబంధించిన ఫలితాలు ఇలా ఉంటాయి.

**సాగరం :** మహాసముద్రం, అలలతో ఎగిసిపడే విధంగా కలలో కనిపించినా – ఆ అలలు మిమ్మల్ని చుట్టుముట్టినట్లు కల వచ్చినా ఆపదల వలయంలో మీరు ఇరుక్కుంటారు.

★ ఏదైనా నావలోనో – మరపడవలోనో ప్రయాణిస్తూ సముద్రాన్ని దాటినట్లు కలగంటే సుదూరప్రాంతాలకు ఉద్యోగార్థం వెళ్తారు.

★ నిర్మలమైన అలలు లేని సముద్రాన్ని కలలో చూస్తే సాఫీగా తలపెట్టిన కార్యక్రమాలు సాగుతాయి.

**నది :** మనకు బాగా పరిచయం ఉన్న నదీ తీరాలను మనం అప్పుడప్పుడు కలల్లో చూడటం తటస్థించవచ్చు. అయితే నదీప్రవాహం నిర్మలంగాఉంటే అనుకున్న పనిని సాధిస్తారు. ఒక్కోసారి నదిలో నీరు మురికిగా ఉన్నట్లు కల రావచ్చు! దుష్ట ఆలోచనలతో మనసు పాడవుతుంది.

★ నదిలో మీరుగాని, ఇతరులు ఎవరైనాగానీ దూకుతున్నట్లు కలవచ్చిందా ? అది అశుభసూచకమే! అయితే నదిని ఒక ఒడ్డునుంచి మరో ఒడ్డుకు ఈదడం కలలో చూస్తే, అంతవరకూ ఉన్న కష్టాలు కొన్ని తొలగుతాయి.

**చెరువు :** పట్టణాల్లో, గ్రామాల్లో చాలాచోట్ల నాలుగు గట్లతో అలరారే చెరువులు ఒకప్పుడు విస్తారంగా ఉండేవి. ఇటువంటి చెరువు కలలో కనిపిస్తే అది శుభసూచకమే! అయితే అది నిర్మలంగా ఉండాలి.

★ కల్లోలంగా ఉన్న (కలకలమైన నీటితోగల) చెరువు కన్పించినా, మురికినీటితో కూడిన చెరువును కలలో చూసినా చెడు వార్తలు అందుకుంటారు.

**సరస్సు :** చాలావరకు విస్తరించిన ప్రదేశంలో ఉండి ఒక ఒడ్డు నుండి మరో ఒడ్డుకు ప్రయాణం చేయడానికి అనువుగా ఉండేవి సరస్సులు. వెన్నెల రాత్రులలో ఇటువంటి సరస్సులలో నౌకా విహారం చేస్తున్నట్లు కలగంటే మీకు భవిష్యత్తులో సకల సౌకర్యాలు వస్తాయి.

★ కేవలం సరస్సును మాత్రమే చూస్తే, ఆనందం-ప్రేమ వ్యవహారాలలో జయం చేకూరుతాయి.

**కాలువ :** ప్రవాహంతో కూడిన కాలువను కలలో చూస్తే ప్రయాణసూచనగా భావించాలి. నీరు స్వచ్ఛంగా లేకుంటే ప్రయాణంలో చికాకులు తప్పవు.

★ కాలువలో మీరు కొట్టుకొని పోతున్నట్లు కలగంటే, మీమీద అపవాదులు పడే ప్రమాదం ఉందని అర్థం.

**బావి/నుయ్యి :** ఒరలతో కూడిన మంచినీటి బావిని కలలో చూస్తే ధనలాభం. అయితే ఒరలకు బదులు రాళ్ళపేర్పు చూస్తే ధనం వచ్చినట్టే వచ్చి జారిపోతుంది.

★ బావి/నుయ్యి నీటిమట్టం పెరిగినట్లుగా కలరావడం కూడా ధననష్టాన్నే సూచిస్తుంది.

★ బావిలోకి దుమికి ఆత్మహత్య చేసుకున్నట్లు కలరావడం జరిగితే, సమీప బంధువులకు అతి త్వరలో దుర్మరణం ఏర్పడవచ్చు!

**పారే నీరు :** ఒక్కోసారి కలల్లో ఫలానా జలవనరు అని గుర్తించడం సాధ్యం కాదు. ఏదో ప్రవాహం మాత్రం ఉంటుంది. ఇటువంటి పారేనీటికి కలలోని ఫలితం చెప్పవలసి వస్తే నూటికి 50 శాతం శుభఫలితాలే ఉంటాయి.

**ఊటనీరు :** నీరు ఊరుతున్నట్టుగా కలరావడం కూడా మంచిదే! సత్ఫలితాన్నే ఇస్తుంది. ప్రదేశం ఏదన్నది అస్పష్టంగా ఉన్నా, చెలమ (నీటిఊట)లో నీటిని మీరు త్రాగుతూ ఉన్నట్లు కలగంటే, అసాధ్యాలని భావిస్తున్న పనులు కూడా సానుకూలపడతాయని గ్రహించండి.



**బురదనీరు :** వాడి వదిలేసిన నీరు, మురుగు కాలువల్లో పారేనీరు కలలో కన్పించడం అరిష్టమే! ఇటువంటి కలగన్న వారికి, వారి వెంట తిరిగే వారివల్లనే కష్టాలు సంభవించవచ్చు! ఇటువంటి బురదనీటిని మీరు ఇతరులపై చల్లినట్లు కలగనడం మీకు మంచి కలిగిస్తుంది. చిరకాలంగా మీపై వున్న అపనిందలు సునాయాసంగా తొలగిపోగలవు. అదే నీటిని ఇతరులు చల్లినట్లు కలవస్తే నీలాపనిందలు కలుగుతాయి.

## 3. పక్షి సంబంధమైనవి

**నెమలి :** పెళ్ళీడుపిల్లలకు నెమలి కలలో కనబడటం చాలామంచిది. త్వరలో వివాహం జరగడం మాత్రమేగాక అత్తవారి మూలాన విశేష ధనలాభం కలుగుతుంది.



★ విధవలకు నెమలి కలలో కనబడితే, తీర్థయాత్రా సందర్శన యోగం లేదా పురాణ గాథల శ్రవణం ద్వారా ఆనందం కలుగును.

**చిలుక :** కలలో రామచిలుక కనబడటం శ్రేష్టమే! వ్యవసాయదారులైతే, వారికి పంటలు బాగా ఫలిస్తాయి. ఆదాయవృద్ధి ఉంటుంది.

★ కలలో రామచిలుకను చూసినచో దూరదేశ ప్రయాణాలు, ఫలితంగా విశేషవృద్ధి.

★ దూరదేశాల్లో ఉన్నవారికి రామచిలుక కలలో కనబడితే వారి గురించి స్వదేశంలో పుకార్లు, కలగన్నవారికి మాత్రం ఐశ్వర్యవృద్ధి.

**పావురం :** పావురాలు కలలో కనిపించడం కూడా విశేష శుభమే! అయితే పెళ్ళికాని వారికి, వృద్ధులకు చాలామంచిది. భోగభాగ్యవృద్ధి.

★ స్త్రీలకు పావురాలు కలలో కనిపిస్తే, భర్తకి ఆపదల మూలంగా శోకం.

★ పురుషులకు కనిపిస్తే, భార్యకు రోగాల మూలకంగా వేదన.

**కాకి :** కాకులను సహజంగానే అశుభసూచకంగా భావిస్తారు. కలలోకూడా ఈ విషయమై ఏ మాత్రం మినహాయింపు లేదు.

★ కాకి ఎగురుతున్నట్లు కలవస్తే దురదృష్టసూచకం.



★ కాకి అరుస్తున్నట్లు లేదా అరుస్తూ ఎగురుతున్నట్లు కల అపాయమే!

★ కాకి కేవలం కలలో అరుపుగాని, ఎగరడంగాని లేకుండా కనిపించినా సరే! కీడు తథ్యం. చేసే వ్యాపారాలలో నష్టం సంభవం!

★ కాకులు తన నెత్తిపైనుంచి ఎగిరినట్లుగా గాని; గుంపులు గుంపులుగా గాని ఎగురుతున్నట్లు కలగన్నా ఆయుఃక్షీణము.

**కొంగ :** కొంగల్ని గాని, పిచ్చుకల్ని గాని, కౌజు పిట్టల్ని గాని కలలో చూస్తే మంచిదే!

★ కొంగలు ఒక బారువలె ఎగురుతున్నట్లు కలగంటే మేలు కలుగును.



**బాతు :** బాతులు, ఇతర నీటిపక్షులు నీట్లో ఈదుతున్నట్లు కలగంటే వ్యాపారంలో అధికలాభం.

★ బాతుల్ని కలలో చూడడం మంచిది.

**కోకిల :** కోకిలను కలలో చూస్తే (స్త్రీల విషయంలో) ఈమె భర్త పరాయిస్త్రీ వలలో తగులుకున్నాడని అర్థం.

★ పెళ్ళికాని యువతీయువకుల విషయంలో – కోరిక ఫలించినట్లే వుండి అంతలోనే విఫలం కావడాన్ని కోకిల కల సూచిస్తుంది.

★ కల్లో కోకిలను చూసినా; అది కూస్తున్నట్లు కలవచ్చినా పురుషులకు తాము మక్కువపడ్డ స్త్రీ లభించినట్లే లభించి, దూరమౌతుంది.




★ భరద్వాజ పక్షి కలలో వస్తే సంతాన సౌఖ్యం, ధనలాభం, అనుకూల దాంపత్య జీవితం తథ్యం.

★ గద్దల్ని కలగన్నచో చోరభయం.

★ గుడ్లగూబలు, గబ్బిలాలు.... ఇవి సహజంగానే అపశకున పక్షులు. కలలో కూడా వీటిని దర్శించినపుడు ఫలితాలు భిన్నంగా ఉండవు. ధనహాని, రోగం, కారాగారవాసం వంటి దుష్ఫలితాలే ప్రాప్తిస్తాయి.

★ గరుడపక్షి స్వప్నంలో కనిపిస్తే కార్యసాఫల్యతకు నిదర్శనం. శ్రీహరి వాహనం శుభసూచకం.

★ చక్రవాకపక్షులు, వడ్రంగిపిట్టలు, వానకోయిలలు కలల్లో కనిపించడం సౌభాగ్యం.

★ పక్షుల్ని ఒక్కోసారి స్పష్టంగా కలలో గుర్తించడం కష్టం! అయినప్పటికీ గుడ్లుతోసహా పక్షిగూడు దొరికినట్లు కలగంటే ధనలాభం.

★ ఇందులోనే - చాలా గుడ్లు కనిపిస్తే మరింతగా ఐశ్వర్యప్రాప్తి.

★ అయితే - ఆ పక్షిగుడ్లను తాను తిన్నట్లు కలగంటే ధనహీనతకు దారితీస్తుంది.

★ పక్షిగూడు అప్రయత్నంగా దొరికినట్లు గాని; అందులో ఏమున్నదీ తాను చూడకుండానే దాన్ని జాగ్రత్త చేసినట్లుగా గాని కలవస్తే శుభం.

★ ఎగరలేని పక్షిగూడు దొరికినట్లు కలగంటే న్యాయవ్యవహారాల్లో అపజయం.

★ ఎగురుతున్నట్లుగా పక్షులగుంపుల్ని కలలో చూస్తే ధనహీనులకు ధన లాభం. ఇదే కలను ధనవంతులు చూస్తే దరిద్రం.



★ పక్షులవేట కలలో చూడడం లాభమే!

★ పంజరం నుంచి పక్షులకు తాను స్వేచ్ఛాజీవితాన్ని ప్రసాదించినట్లుగా కలగంటే ధనప్రాప్తి; తలపెట్టిన పనుల్లో జయం.

★ తన గృహంలోగాని, ఇంటిచూరులోగాని పక్షిగూడును చూసినా లేదా అందులో ఉన్న గుడ్లని పడేసినట్లు కలగన్నా ఐశ్వర్యహాని.

★ పక్షులు ముక్కులతో పొడుచుకుంటూ పోట్లాట పెట్టుకున్నట్లుగా కలవస్తే కష్టాలకు సూచన.

★ తాను ఓ పక్షిలా ఆకాశంలో ఎగురుతున్నట్లు కలగంటే, తమ వాడ/వీధిలో ఎవరో మరణించబోతున్నారని అర్థం.

★ గాయపడ్డ పక్షుల్ని కలలో చూస్తే, కష్టాలు వెంట వెంటనే వస్తాయి.

★ తాను పక్షుల్ని వధించినట్లు కలగనడం దురదృష్ట సూచకం.

★ రంగు రంగుల పక్షులు తెలియనివి కలలో కన్పించినా సుఖవంతమైన జీవితం మున్ముందు ఉంటుందని చెప్పవచ్చు!

## 4. జంతు సంబంధమైనవి

జంతువుల్లో సాధుజంతువులు లేదా పెంపుడు జంతువులు - క్రూర జంతువులు లేదా అడవి జంతువులు కలలో కనిపించే తీరుతెన్నులను బట్టి శుభాశుభ ఫలితాలు ఉంటాయి. అన్ని సాధుజంతువులూ శుభఫలిత సూచికలు కానట్లే అన్ని క్రూరజంతువులూ అశుభ ఫలితాలే కనిగించజేయవని గ్రహించాలి!

**ఏనుగు** : గజరాజును కలలోచూస్తే (సాధారణస్థితిలో) ముఖస్తుతికి లొంగిపోయి ఎలాంటి అకృత్యాలనైనా చేస్తారు.



★ ఏనుగు ఎక్కినట్లుగా అవివాహితులు కలగంటే పెళ్ళి జరగబోతోందని అర్థం. వివాహితులైతే మరో స్త్రీ వ్యామోహంలో పడతారని గ్రహించాలి.

★ ఏనుగు దంతాలను మాత్రమే కలలో చూడటం తటస్థిస్తే కళాకారులుగా గాని; కళలపట్ల ఆసక్తి వున్నవారుగాని అవుతారు.

★ పిల్ల ఏనుగులు కలలో కనిపించడం సంసార సుఖానికి సూచిక.

★ అంబారీతో అలంకరించబడిన ఏనుగు కలలో కనిపిస్తే దేవుడి ఆలయాలను - పుణ్యక్షేత్రాలను సందర్శించాలనే ఆసక్తి అధికమవుతుంది.

**సింహం :** సింహం అడవిలో స్వేచ్ఛగా సంచరిస్తున్నట్లుగా కలవస్తే, మీరు శత్రువులపై విజయం సాధించగలుగుతారు లేదా అన్ని రంగాల్లోనూ మీరే విజేత అవుతారు.

★ మీరు సింహంతో పోట్లాడినట్లుగా కలవస్తే, త్వరలోనే సమస్యలలో ఇరుక్కోనున్నారని అర్థం లేదా మీకు చిక్కులు కల్పించేవారు ఎక్కువ.

★ మరణించిన సింహం కలలో కనిపిస్తే, మీరే శత్రువులపై విజయం సాధిస్తారు.

★ కట్టివేసిన లేక బంధించబడిన సింహాన్ని కలలో చూడటం తటస్థిస్తే, మీరు వ్యవహారాల్లో జయం పొందుతారని సూచన.

**పులి :** చిరుతపులిగాని, చారలపులి గాని కలలో కనిపిస్తే నీచ స్త్రీలవల్ల ఆపదలు లేదా శత్రువు పన్నే కుయుక్తులకు మీరు ఎర అవుతారు.



★ చిరుతపులితో మీరు పోరాడి వధించినట్లు కలగంటే, వ్యవహారాల్లో మీరే విజేత అవుతారు.

★ పులి మిమ్మల్ని చీల్చి చెండాడుతున్నట్లు కలవస్తే మీరు దీర్ఘవ్యాధి బారినపడే అవకాశం ఉంది.

**తోడేలు :** తోడేలు (హైనా)తో మీరు తరుమబడుతున్నట్లు కలవస్తే, మీకు ఋణాలు చేయక తప్పని పరిస్థితి ఎదురవుతుంది.

★ ఆ తోడేలుపై మీరు తిరగబడి, దాన్ని వధించినట్లు కలగంటే - ఇంతవరకూ ఉన్న ఋణాలు తీరుతాయని అర్థం.

**నక్క :** నక్క కలలో కన్పిస్తే శత్రువులు ఎక్కువవుతారు. వారి వల్ల కష్టాలు.

★ నక్కను మీరే వేటాడి పట్టి బంధించినట్లు కలగన్నా - చంపినట్లు కలగన్నా మీరు కొద్దిరోజులు అస్వస్థులవుతారన్నమాట!

**ఎలుగుబంటి :** దట్టమైన నల్లని రోమాలతో నిలువెల్లా కప్పబడివుండే దాన్ని కలలో చూస్తే ఇక కష్టాలే కష్టాలు. శరపరంపరలా చుట్టుముడతాయి.

★ కేవలం ఎలుగుబంటి తోలు (బాగా చదునుచేసి వున్నది) కన్పిస్తే, అంతవరకు ఉన్న సమస్యలు తొలగి శాంతి ఏర్పడుతుంది.

**ముళ్ళపంది :** ముళ్ళ పందిని కలలో చూస్తే అసూయా ద్వేష, మాత్సర్య గ్రస్తులతోనే స్నేహం తటస్థిస్తుంది.

★ ముళ్ళపంది మిమ్మల్ని తరుముతున్నట్లుగా కలవస్తే, మీ అమాయకత్వం వల్ల ఇతరులు తెలివిగా మిమ్మల్ని బోల్తా కొట్టిస్తారన్న మాట!

**వింత జంతువు :** పేరుకూడా తెలీనిది, ఎన్నడూ చూడనిదీ అయినటువంటి జంతువును కలగనడం మీకొక విషాదవార్తను సూచిస్తుంది.

**లేడి :** లేత పచ్చిక మేస్తున్నట్లుగా కలలో లేడి కనిపించడం, మీరు ప్రేమలో పడ్డారనడానికి గుర్తు లేదా మీరంటే ఇష్టులున్నారని అర్థం.

★ మీరు లేడిని వధించినట్లుగా గాని; తరుముతున్నట్లుగా గాని కలగంటే, మీ జీవిత భాగస్వామితో కలహం ఏర్పడినట్లే!

**కోతి :** కోతి కలలో కనిపించడం కలహాకారణమని అర్థం. మీచుట్టూ నయవంచకులు చేరి మిమ్మల్ని మోసగించినా ఆశ్చర్యంలేదు.



★ రామాయణంలోని వాలి - సుగ్రీవులను వానరరూపాన మీరు దర్శించినా శుభ్ర వానరాలను కలగన్నా బంధుదర్శన ప్రాప్తి.

★ శ్రీమదాంజనేయస్వామిని కలలో చూడగలగడం గొప్ప మేలు.

**కుందేలు :** కలలో తెల్లని కుందేలు కనబడితే సుఖసంతోషాలతో ఉంటారు.



★ కుందేళ్ళ గుంపును చూడగలిగితే బంధుదర్శనం; అవి ఏ జంతువు చేతనైనా ఆరగించబడుతున్నట్లు కలవస్తే సంతానహాని.

**కుక్క :** కుక్కని కలలో చూస్తే చాలా మంచిది. తన వద్దకు కుక్క పరుగెత్తుతూ వస్తున్నట్లు కలగనడం నూతన స్నేహవృద్ధిని సూచిస్తుంది.

★ కుక్క తనను చూసి మొరుగుతున్నట్లుగా కలగంటే, ప్రాణస్నేహితులతో విరోధం ఏర్పడినట్లుగా భావించాలి.

★ కుక్క తననే అనుసరించి తిరుగుతున్నట్లయితే విశ్వాసపాత్రులు – నమ్మకస్తులయిన స్నేహితులు తనను ఆపదలనుండి గట్టెక్కించగలవారు తనకు తోడుగా ఎల్లవేళలా ఉన్నారని అర్థం.

**పిల్లి :** కలలో పిల్లి ఇల్లంతా కలయదిరుగుతున్నట్లు కనిపిస్తే, త్వరలోనే తనవారే తనకు ద్రోహం తలపెట్టబోతున్నారని తెలుసుకోవాలి.

★ కలలో మేడమీంచి పిల్లి మెట్ల మీదుగా ఎక్కుతూ లేదా దిగుతూ కనిపిస్తే నౌకర్లు తమ సొత్తు అపహరించడానికి కుయుక్తులు పన్నుతున్నారని అర్థం.

★ స్త్రీలకు కలలో పిల్లులు కనబడడం, తమ భర్తవల్ల తాము అవమానాలకు సూచన.

**ఎలుక :** ఎలుకలను కలలో దర్శించడం ఎప్పుడూ కీడు సూచింపవచ్చు! అవి ఇల్లు త్రవ్వుతున్నట్లుగా కలగంటే ద్రవ్యహాని.

★ ఎలుకల సందడి ఇంట్లో అధికంగా ఉన్నట్లుగా కలగంటే, తమతో తిరుగుతూనే తమపట్ల ద్వేషంతో సంచరిస్తున్న వారున్నారని అర్థం.



## ఇతరములు

★ ఆవు తనను తరుముకొస్తున్నట్లు కలగంటే (స్త్రీలైతే) తమ భర్త పరస్త్రీ వ్యామోహంలో పడుతున్నట్లుగా – పురుషులైతే ఇంకో స్త్రీవల్ల చిక్కుల్లో పడుతున్నట్లుగా గ్రహించాలి.

★ గుర్రాన్ని కలలో చూస్తే బంధుదర్శన ప్రాప్తి.

★ గాడిదల్ని తోల్తున్నట్లు కలగంటే కష్టాలు దూరం.

★ ఈగలు మొ॥ కీటకాలు కలలో కనిపించడం శతృవృద్ధికి సూచన. (ఇవి సాముదాయక ఫలితాలు)

★ జలచరాలు మొ॥ కలలో చూస్తే శత్రుభయం.



## 5. వృక్షసంబంధమైనవి

ఈ విభాగంలో చెట్లు, మొక్కలు, పూలతీగలు, మహావృక్షాలు కూడా చేరతాయి. పూలతీగలన్నీ శుభకరమైనవనీ, అరణ్యంలో వృక్షాలన్నీ అంత మంచి ఫలితాన్ని కలుగ చెయ్యవు అనీ చాలామంది భావిస్తుంటారు. అనుభవంలో ఆ అభిప్రాయాలు తప్పు అని ఋజువైంది. శాస్త్రీయ ఫలితాలతో సరిపోల్చి నిజమైనవని తేలినవి ఇక్కడ ఇస్తున్నాం!

**మర్రిచెట్టు :** ఈ చెట్టు సాధారణంగా కలల్లో ఎక్కువగా రాదని ఒక పరిశీలనలో తేలిన అంశం. మర్రిచెట్టును కలలో చూస్తే అధిక సంతానం కలుగుతుంది. అవసరాలకు సరిపోయేటంతగా ధనం సమకూరుతుంది. సామాన్య జీవనం గడుపుతారు.

**రావిచెట్టు :** ఈ చెట్టు కలలో కనిపించినవారికి, ఇతరులచేత సులభంగా మోసపోయే గుణం ఉండగలదు లేదా అమాయకులై ఉంటారు.

★ ఎండిన రావి ఆకులు కలలోకి వస్తే ఆ కలగన్న వారి ప్రేమను పంచుకొనే వ్యక్తులతో ఏవైనా చిక్కులు సంప్రాప్తించవచ్చు!

★ రావి ఆకుల్ని ఇతరుల చేతినుంచి మీరు పుచ్చుకున్నట్లుగా కలగంటే మిమ్మల్ని అభిమానించేవారు అంత మోసకారులు కారని గ్రహించవచ్చు!

★ రావి ఆకులు ఏరినట్టు కలగనడం దుష్టస్నేహానికి నిదర్శనం.

**జమ్మి చెట్టు :** కలలో జమ్మిచెట్టును దర్శించడం శుభప్రదం. కీర్తి ప్రతిష్టలు ఇనుమడిస్తాయి. జమ్మి ఆకులు కూడా ఇదే ఫలితాన్నిస్తాయి.

**వెదురు :** నిట్ట నిలువుగా పెరిగిన వెదురు పొదను కలలో చూడటం ద్వారా స్నేహితులవల్ల ఆనందిస్తారు.

**తాటి చెట్టు :** దూరంగా కలలో తాటిచెట్టు కనిపిస్తే – మీరు తలచిన పనులు నిర్విఘ్నంగా నెరవేరతాయి. తాటితోపులోని ఒకచెట్టును గాని – ఇంట్లో ఒక చెట్టును గాని చూస్తే అసంతృప్తి.

★ తాటిచెట్టు ఎక్కినట్టు కలవస్తే మీ పనులలో ఆటంకాలు ఎదురవుతాయి.

**ఇతరచెట్లు :** పూతపట్టుమీద ఉన్న చెట్లు కలలో కన్పించడం అదృష్టదాయకం.

★ అదే చెట్టుగాని లేదా ఇతర పూలచెట్లు ఆని ఎక్కినట్లు కలగంటే మీ జీవితం సాఫీగా సాగిపోతుంది.

★ అటువంటి చెట్టును నరుకుతున్నట్లుగా కలగంటే దురదృష్టవంతులని సూచన.

★ తెల్లని పూలచెట్లు కలలో కనిపిస్తే మీ ప్రేమ పొందేవారు, అంతగా నమ్మదగ్గవారు కాదన్నమాట.



**పూలతీగలు :** ప్రాకే మొక్కలు, పూలతీగలు, లతలు ఇటువంటివి కలగనడం భవిష్యత్తు బాగుంటుందనడానికి నిదర్శనం.

★ గోడమీదికి ప్రాకుతున్నట్లున్న పూలతీగల్ని త్రెంచుతున్నట్లు కలగంటే, మీ కోరికలు తీరవని అర్థం.

**పొదలు** : గుబురుగా పెరిగే పొదలు ఏవైనాసరే.... కలలో కనిపిస్తే కష్టకాలం గడిచిపోయి, మంచిరోజులు దగ్గరకొస్తున్నట్లు అర్థం.

**ముళ్ళమొక్కలు** : మీరు ముళ్ళచెట్ల మధ్య పడినట్లు కలగంటే మీ జీవితం చిక్కుల్లో పడినట్లు అర్థం.

★ కలలో ముళ్ళచెట్లు మీ దేహాన్ని ఏ విధంగా బాధించినా, మీ మిత్రులలో ఎవరితోనో మీరు వివాదాన్ని ఎదుర్కోవాల్సి వస్తుంది.

**ఇతర మొక్కలు** : కలలో ఆకులు-పూలతో గుబురుగా పచ్చగా ఉన్న మొక్కలు కనిపిస్తే, మీకు అర్థికంగా కలిసి వస్తుందని అర్థం.

★ మొక్కల్ని మీరు పీకేసినట్లు కలగంటే దురదృష్టం మిమ్మల్ని వెంటాడుతున్నట్లు గ్రహించండి.

★ మొక్కలు చెల్లాచెదురైనట్లుగా కలగంటే మీరు మోసానికి గురికాబోతున్నారన్నమాట!

**తోట** : బ్రహ్మచారులకు తోట కలలోకి వస్తే త్వరలో మంచి తోడు దొరుకుతుంది.

★ కన్నెపిల్లకు ఈ కలవస్తే రాకుమారుడు లాంటి అందగాడిని వరిస్తుంది.

★ తోటలో విహరిస్తున్నట్టుగా కలగనడం మాత్రం ఆపదలకు సూచన.

**తోటచుట్టూ కంచె** : అస్పష్టంగా తోట కన్పిస్తూ, కంచె మాత్రం బాగా కలలోకి వస్తే అనుకోని బాధలు కలుగుతాయి.

★ మీరు కంచెను దాటుకుంటూ లోపలకు ప్రవేశించబోయి పడితే, కష్టపడి సాధించిన పనిలో నష్టమే తప్ప లాభం ఉండదు.

**పొలం** : సారవంతమైన పొలం కలలో కనిపిస్తే, మీ ఆరోగ్యం అనుకూలంగా ఉంటుంది. బీడుగా ఉన్న పొలం కలలో చూస్తే ఆదాయం తగ్గుతుంది.

★ పొలానికి అడ్డంపడి పరుగులు తీస్తే లేదా ఇతరులు ఎవరైనా పొలానికి అడ్డంగా ఉరికితే, మీ అదృష్టం తరిగిపోతుంది.

**చెట్ల మధ్య దారి** : కలలో చెట్లమధ్య ఉన్న దారిగుండా నడిస్తే మీకు అప్పుల వాళ్ళ బెడద ఉండదు.

★ అదే ప్రయాణం రాత్రిపూట అయితే, ఎక్కడికో ప్రయాణం చేస్తారని అర్థం.

★ చెట్లమధ్య దారి చీకటిగా ఇరుగ్గా ఉన్నట్లు కలవస్తే మీ కోరికలు తీరవు.

**బ్రహ్మాజెముడు :** ఈ చెట్ల పొదల్లోకి మీరు తోయబడితే, కష్టాలపాలై సతమతమవుతారు.

★ పూలతోటల మధ్యలో ఈ జెముడుచెట్లను చూసినట్లు కలగనడం మిమ్మల్ని అంతా ఆడిపోసుకోనున్నారని అర్థం.

**నిద్రగన్నేరు :** ఇది కలలో కనిపిస్తే మీకు కష్టాలొస్తాయి. నిద్రగన్నేరు చెట్టు ఎక్కినట్టు కలగంటే, మీకు శత్రువులు వృద్ధి అవుతున్నారని అర్థం.

## 6. గృహ సంబంధమైనవి

**పొయ్యి :** మండే పొయ్యి కలలో కనిపించడం సుఖశాంతులు చేజారుతా యనడానికి నిదర్శనం. పొయ్యి మండకుండా ఉన్నట్లు కలగంటే కుటుంబ కలహాలు ఏర్పడతాయి.

★ పొయ్యిని శుభ్రం చేస్తున్నట్లు, బూడిద ఎత్తినట్లు వచ్చే కల మిమ్మల్ని ప్రేమ వ్యవహారాల్లో నవ్వులపాలు చేయగలదు.

**మంటలు :** పొయ్యితో సంబంధం లేకుండా ఎక్కడైనా మంటలను మాత్రమే కలగనడం శుభసూచకం.

★ ఇంట్లో పొయ్యి మంటల్ని కలలో చూడడం తటస్థిస్తే పిల్లలు ప్రియతములతో ఆనందంగా గడుపుతారని అర్థం!

★ మంటల్లో మీ యిల్లు తగలబడుతూ పొగలతో సహా కలవస్తే మీకు కష్టాలు.

**అగ్గిపుల్ల :** కేవలం అగ్గిపుల్లను కలలో చూస్తే ఫలితమేమీ ఉండదు. కాని అది గీసి మండించినట్లుగా కలవస్తే మాత్రమే మీరు త్వరలో ప్రేమలో పడతారని గ్రహించండి.

**కిరోసిన్ :** దీపం బుడ్డిలో కిరోసినాయిలు పోస్తున్నట్లుగా కలగడనం అంత మంచిది కాదు. కష్టాలు పెరుగుతాయి. ఆనందం హరించుకుపోతుంది.

**దీపం :** దీపం వెలుగుతూన్నట్టుగా కలలో కన్పించడం గొప్ప అదృష్టదాయకం.

★ అయితే – ఆ దీపం ఉజ్వలంగా వెలుగుతున్నట్టుగా కలగడనం వల్ల మీరు ఇతరులను ఆనందింప జేయగలుగుతారని చెప్పవచ్చు!

**నూనె :** ఏదైనా పదార్థం చేయడానికి గాని - ఆహారంగా గాని నూనె వాడుతున్నట్లు కలగంటే, మీకు మేలు జరుగుతుంది.

★ నూనె ఆవిరవుతూ కాల్తున్నట్లు - పొగతో కూడినట్లు కనిపిస్తే మాత్రం అంత మంచిదికాదు. వెన్న మాత్రం కలలో కన్పిస్తే మంచిది.

**ఆవిరి :** నీటి ఆవిరి కలలో కనిపించడం వల్ల బాధలు కష్టాలు చుట్టుముడతాయి. ఏదైనా యంత్రంలోంచి/గొట్టంలోంచి ఆవిరి వస్తున్నట్లు కలలో కనిపిస్తే, నలుగురి మధ్య భంగపాటు చెందడం తటస్థిస్తుంది.

**గ్రుడ్లు :** ఇళ్ళలో పెంచుకొనే పెంపుడు జంతువుల (పక్షుల) గ్రుడ్లు కలలో కనిపిస్తే, మీకు త్వరలో ఆదాయవృద్ధి ఉంటుందని అర్థం. ఉద్యోగస్తులకు మాత్రం ఇది వర్తించకపోవడమే చిత్రం.

★ పగిలిన గ్రుడ్లు కనిపిస్తే మీరు ఇంకా ఎక్కుగా నష్టపోతారు.

★ గ్రుడ్లు తిన్నట్టుగా కలగనడం, మీరు దంపతులైనా - ప్రేయసీప్రియులైనా అనురాగ వృద్ధిని సూచిస్తుంది.

**మాంసం :** మాంసాన్ని కొంటున్నట్లుగా గాని - తింటున్నట్లుగా గాని కలగంటే, వృత్తి వ్యాపారాలలో మీ నిర్లక్ష్యం వల్ల నష్టపోతారని అర్థం. కొన్ని సందర్భాలలో ఎంతో కాలంగా శ్రమించి, ఫలితం కోసం ఎంత ఎదురు చూసినప్పటికీ దాన్ని పొందలేరు.

**ఉల్లిపాయ :** కలలో ఉల్లిని చూస్తే విచారగ్రస్తులు అవుతారు. అట్లే కలలో ఉల్లిని కోసినట్లుగా చూస్తే విషాదవార్తలు వినాల్సివస్తుంది. కాని ఉల్లిని తింటున్నట్లు కలగంటే మాత్రం మీదే విజయం. ఎలాటి కష్టాన్నైనా అధిగమిస్తారు.

**కొత్తిమీర :** దీన్ని కలలో చూసినా - తిన్నా మన ఇరుగుపొరుగులు మంచిగా ఉంటారని అర్థం. కలలో కొత్తిమీర కొంటున్నట్లుగా వచ్చిందనుకోండి!.. మీ కోరికలు అనుకోకుండానే నెరవేరతాయి.

**కొబ్బరి :** కొబ్బరి సహజంగానే శుభప్రదం కనుక కలలో కూడా ఇంతకంటే విరుద్ధంగా ఏమీ జరగదని గ్రహించాలి. అయితే కొబ్బరిని పగుల గొట్టినట్లుగా చూస్తే మాత్రం కొద్దిపాటి లాభంతో సరిపుచ్చుకోవడం ఉత్తమం!

**ఆకుకూరలు :** ఆకుకూరలను తిన్నట్లు కలగనడం, మీరు అదర్శప్రాయమైన జీవితం గడుపుతారని అర్థం! అయితే కొన్ని రకాల ఆకుకూరలు... ఉదా : బచ్చలి కూర వంటివి విత్తనాలను చల్లినట్లుగా కల రావడం అంత మంచి ఫలితాన్నివ్వదు. నిందలు ఎదుర్కొంటారు.

**దుంపలు :** ఆహారంగా వాడే పదార్థాలలో దుంపలు చాలావరకు శుభప్రదమైన కలలనే సూచిస్తాయి. [illegible] దుంపలను ఒక కుప్పవలె చూస్తే మీ కుటుంబం సుఖసంతోషాలతో వృద్ధి పొందుతుంది.

★ బీట్‌రూట్ దుంప తింటున్నట్లు కలగంటే చిక్కులనుండి విముక్తిని పొందుతారు.

★ క్యారెట్ దుంప కలలో కనిపిస్తే మీ దేహారోగ్యానికి ఢోకా లేనట్టే!

★ ముల్లంగి దుంపలు పెంచినట్లు కలగనడం చక్కని ధనలాభానికి సూచిక.

**టమాటో :** దీన్ని తింటున్నట్లు కలగంటే, నిత్యము ప్రయాణాల్లో ఉన్నట్లే! పుణ్యక్షేత్రాది సమస్త ప్రయాణాలు నిర్విఘ్నంగా నెరవేరగలవు.

**చిక్కుడు :** చిక్కుడుకాయలను కూరగాచేసి తిన్నట్లు కలవస్తే మీకు ఇతరులతో గొడవలొస్తాయి. చిక్కుడుకాయలు గుత్తులు గుత్తులుగా పందిరిపైన కాసినట్లు కలవస్తే, మన పనులకు ఆటంకాలు అధికంగా ఎదురవుతాయి.

**గుమ్మడి :** గుమ్మడికాయ గాని, పండుగాని కలలో కన్పించడం శుభసూచకమే! గుమ్మడిని భుజిస్తున్నట్లు కలగడనం వల్ల, కుటుంబంలోని సభ్యులకు సుఖశాంతులు ఏర్పడతాయి.

**అల్లం :** కలలో దీన్ని తిన్నట్లు కన్పిస్తే, మీరేదో ప్రేమ వ్యవహారంలో ఇరుక్కున్నారని అర్థం.

**మిరియం :** కలలో మిరియాలు వాడినట్లు కన్పిస్తే బంధువులతో కలహప్రాప్తి.

**గసాలు :** చెట్లకు గసాలు (గసగసాలు) కలలో చూస్తే గొడవలొచ్చే సూచన.

★ వీటిని తిన్నట్లు కలగంటే ఆశించిన ఫలితాలు సిద్ధించవు.

**ఉప్పు :** ఉప్పును చిందర వందర చేస్తున్నట్లుగా కలగంటే, అదృష్టం చేజారనున్నట్లుగా భావించాలి.

**ధాన్యం :** ధాన్యం కుప్ప తగలబడుతున్నట్లు కలవస్తే అతివృష్టి/అనావృష్టి వల్ల పంటలకు అరిష్టం.

★ అన్నం కలలో కన్పిస్తే కార్యసిద్ధి. ఆ అన్నం తానే తిన్నట్లుగా కలగంటే రోగకారకం.

★ ఇతరులకు తాను అన్నం పెట్టినట్లు కలగంటే ధనలాభం.

★ తాను అన్నం వండినట్లుగా కలంటే స్త్రీతో సంభోగసుఖం కలుగును.

★ రకరకాల పిండివంటలు తాను తిన్నట్లుగా కలగనడం ఆయుర్ వృద్ధి కారకం.
★ ప్రత్యేకంగా పరమాన్నం తినడం లాభసూచకం.
★ కానీ... పెరుగన్నం తిన్నట్లు కలగడనం మాత్రం రోగకారకం అని గ్రహించాలి.
★ వంకాయకూర తినడం కలగంటే రోగం.
★ బీర, పొట్ల, బెండ.... వీటిని భుజించడం ధనదాయకం.
★ బెల్లంగాని, పంచదారగాని తిన్నట్లు కలగంటే దరిద్రం.
★ కలలో నిమ్మకాయలను చూస్తే ఇంట్లో కలతలు / భార్యతో కలహం.
★ కాలంగాని కాలంలో ఏ పళ్ళు కలలో కన్పించినా, అది రోగకారకం.
★ చింతపండును కలలో దర్శించడం వల్ల వర్తకులకైతే లాభం, ఇతరులకు విదేశీ వర్తమానం అందుకొనుట జరుగును.
★ నారింజ, దబ్బ, పనస.... వీటిని కలలో చూడడం వ్రణాలు (పుండ్లు) ఏర్పడ్డానికి సూచన.
★ జొన్నలు, కందులు, చోళ్ళు కలలో కన్పిస్తే స్ఫోటకం లేదా మొటిమలు ఏర్పడతాయి.
★ ఔషధజాతులు ఏవి కలలో కనిపించినా ఆరోగ్యవంతులకు రోగకారకం. అనారోగ్యంతో బాధపడేవారికి ఆరోగ్యప్రాప్తి.

## 7. మనుష్య సంబంధమైనవి

వివిధ జాతులు, కులాలు, మతాలకు చెందిన (చిహ్నాలతో సహా) వివిధ వృత్తులకు చెందిన పొడుగు, పొట్టి, లావు, సన్నం ఆకృతి కలిగిన రకరకాల మనుషులు కలలో కనిపిస్తుంటారు. ఆ యా విశేషాలను బట్టి ఫలితాలు - మారుతుంటాయి. ఒకేజాతి మనుషులు కనిపించినప్పటికీ ఇతర ఆకార విశేషాలను బట్టి ఫలితాలు ఇక్కడ చూపబడ్డాయి.

★ మరుగుజ్జు వ్యక్తుల్ని కలలోచూస్తే, రోగకారకం అని గ్రహించాలి.
★ బట్టతల గల వ్యక్తుల్ని చూడడం తటస్థిస్తే నిజంగా ధనప్రాప్తి.
★ శత్రువుల్ని చూసినట్లు/పోట్లాడినట్లు కలగన్నా కూడా అరిష్టదాయకమే!
★ బోడిగుండుగల వాళ్ళని కలలో చూసినచో రోగబాధ/దారిద్ర్యబాధ.
★ మాంత్రికులను కలలో దర్శించడం అంటే మోసపోనున్నట్లు సూచన.

★ ప్రభుత్వ పాలకులను/దేశపాలకులను కలగనడం. (ఆ యా పాలకుల స్వభావాన్ని బట్టి) కలగన్నవారికి కీడుగాని, మేలుగాని జరుగుతుంది.

★ మరణించిన వారిని కలలో చూసినా, వారితో మాట్లాడినట్లు కలగన్నా పేరు ప్రతిష్టలు కలుగుతాయని సూచన.

(పై వ్యక్తులకు జాతి/మత/కుల/వృత్తి భేదాలు వర్తించవు.)

★ సంకరజాతుల వ్యక్తుల్ని కలలో చూడడం తటస్థిస్తే కష్టనష్టాల ప్రాప్తి.

★ కలలో బ్రాహ్మణ దర్శనం అంత మంచిదికాదు. పురోహితుని దర్శిస్తే అగ్నిభయం.

★ క్షత్రియులను/పాలను కలలో దర్శించడం కూడా క్షేమకరమే!

★ హీనజాతులు/ఇతర జాతులు (బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు కానివారు) కలలో కనిపించినచో దుఃఖ హేతువు.

★ వైశ్యజాతులను కలలో చూడడం సౌఖ్యకారకం.

★ తురుష్కులు/ముసల్మానులను కలలో చూడడం అంత మంచిది కాదు.

★ కలలో ప్రసవం దర్శిస్తే సుఖజీవనం.

★ కలలో కన్యను చూసినచో పురుషులకు వివాహం; స్త్రీలకు సంతృప్తితో కూడిన సంపత్తు.

★ ఏదైనా వివాహానికి తాను సహాయం చేసినట్లుగా కలగంటే జయం లేదా శుభవార్త.

★ తాను హీనకులంలో పుట్టినట్లుగా కలగన్నచో విశేషలాభం కలుగుతుంది.

★ తాను దిగంబరంగా ఉన్నట్లు కలగన్నచో అపకీర్తి/దరిద్ర సూచకం.

★ తన తల పెద్దదిగా గాని, ఎత్తుగా గాని కనబడితే ప్రసిద్ధి. విశేషాధికారం కలుగుతాయి.

★ కలలో తాను తల దువ్వుకుంటున్నట్లుగా కలగన్నచో అనుకున్న పనులు నెరవేరతాయి.

★ సముద్రం మీద తాను ప్రయాణం అవుతున్నట్లుగా కలగన్నచో ధనలాభం.

★ ఏదైనా కత్తివంటి పదునైన ఆయుధంతో దెబ్బలు తిన్నట్లు కలగన్నచో అపఖ్యాతి.

★ గడ్డం పొడ్డుగా ఉన్నట్లు కలగంటే, అభివృద్ధి తథ్యం.

★ కిలకిలా నవ్వినట్లు కలగంటే దుఃఖం కలుగుతుంది.

★ తన దంతాలు ఊడినట్లు, బడబడా వాగుతూన్నట్లు కలగంటే ప్రయాణం ప్రాప్తిస్తుంది.

★ ఆపద కలిగినట్లు కలగంటే, కుత్సితులైన స్నేహితులున్నట్లు అర్థం.

★ స్నేహితులు తనమీద ఆగ్రహించినట్లుగా కలగంటే, దురదృష్టం-వ్యాధులు సూచితం.



★ తన ముక్కులోంచి రక్తం కారుతున్నట్లు కలగన్నచో చాలా కష్టనష్టాలు సంప్రాప్తిస్తాయి.

★ ముసలివారిని పెళ్ళి చేసుకున్నట్లు కలగంటే, ధనలాభం కలుగుతుంది.

★ భార్య మరణాన్ని కలలో చూసినచో ఆశ్చర్యదాకమైన వార్తలు వింటారు.

★ తాను ఎవరినైనా వధించినట్లు కలగన్నచో, అట్టివారికి తాను త్వరలో ఉపకారం చేయవచ్చు అని అర్థం.

★ తాన ఏ స్త్రీ వలలోనైనా పడితే, అట్టి కల తన వినాశనానికి సూచన.

★ ఒక పురుషుడు గాని, స్త్రీ గాని మళ్ళీ పెళ్ళి చేసుకున్నట్లు కలగంటే రోగపీడితులు అవుతారు.

★ తాను బాగా బలిసినట్లు కలగనడం కూడ పై ఫలితమే.

★ తాను ఒళ్ళు నొప్పులతో బాధపడుతున్నట్లు కలగన్నచో శుభం. ఇదే కల వర్తకులకొస్తే లాభకరం. వ్యవసాయదారులకు సస్యలాభం.

★ ఇతరులుగాని-తానుగాని గురకపెట్టి నిద్రిస్తున్నట్లు కలవల్ల సుఖం.

★ ఇతరుల ప్రోద్బలంతో తాను వ్యభిచరిస్తున్నట్లు కలగంటే కార్యసిద్ధి.

★ ఓ అందమైన స్త్రీ పట్ల ఆకర్షితులైనట్లుగా మాత్రమే కలగంటే అనుకున్న పని నెరవేరుతుంది.

★ కాని, ఆమెతో సుఖిస్తున్నట్లు లేదా జారత్వం వహిస్తున్నట్లు కలగనరాదు. అది ఆపద సూచనం.

★ తాను ఎగురుతున్నట్లు కలగంటే ధనహాని లేదా కార్యం చెడిపోవును.

★ ఏ స్త్రీ అయినా వెంటపడి వచ్చినట్లుగా కలగంటే సంపదలు కలుగును.

★ ఏ స్త్రీకి అయినా తాను గర్భిణీతో మాట్లాడినట్లుగా కలగంటే కవలపిల్లలు కలుగుతారు.

★ తాను బక్కచిక్కినట్లుగా కన్న కల సంసారంపట్ల విరక్తిని సూచిస్తుంది.

★ తన కాళ్ళను ఇతరులు ఎవరో రుద్దుతున్నట్లు కలగంటే ధననాశనం లేదా ముఖస్తుతికి ఉబ్బిపోయి అట్టివారివల్ల నష్టం పొందుట సంభవం.

★ తమ చేతులు విరిగినట్లుగా గాని, కాలిపోయినట్లుగా గాని కలగంటే, అట్టి స్త్రీకి భర్తగాని, కొడుకుగాని మరణిస్తారు.

★ తాను పశుపక్ష్యాదుల తలలు నరుకుతూన్నట్లు కలగన్నచో వృద్ధి

★ ఇతరులు తమను వధిస్తున్నట్లు కలగన్నచో శ్రేయోభివృద్ధి.

★ తాము అంధులైనట్లుగా కలగన్నచో స్నేహితులవల్ల మోసపోతారు. కలలో ఇతర అంధులెవరైనా కనిపిస్తే కార్యభంగం.



★ తాము పిచ్చివారి దరి చేరినట్లు కలగన్నా లేక తాము పిచ్చివారైనట్లు కలగన్నా ధనధాన్య సమృద్ధి ఏర్పడగలదు.

★ కలలో అప్సరసలను చూసినచో ధనహాని.

★ స్వర్గాన్ని కలగన్నా-తాను స్వర్గంలో ఉన్నట్లు కలగన్నా గౌరవ మర్యాదలుంటాయి.

★ పిల్లల మరణాన్ని గాని, మలినదేహాల్నిగాని చూసినట్లయితే ఆపదలు, మోసపోవుట, అయినవారి వల్లనే వంచింపబడుట వంటి దుష్ఫలితాలు.

★ మిత్రుల మరణాన్ని కలలో చూడవల్సిరావడం రోగకారకం అవుతుంది.

★ తాము ఉన్నత కులజులై ఉండికూడా, నిమ్నకులంలో సంచరించినట్లు కలగన్నచో ధాన్యలాభము కలుగుతుంది.

★ తనకు అడవిమృగాల తలలు మొలిచినట్లు కలగన్నచో వ్యవహారజయం.

★ కలలో తన ముఖం వాడిపోయినట్లు దీనంగా కనిపిస్తే ద్రవ్యలాభం, (కలలో జరిగినవి ఇలలో జరగవని ఒక సామెత)



## 8. ఆహార సంబంధమైనవి

కూరగాయలు, ఫలాలు ఇతరమైన తినదగ్గ పదార్థాలు కలలో కనిపిస్తుంటాయి. వాటికి సంబంధించిన ఫలితాలు ఇక్కడ గమనిద్దాం!

★ కలలో తాంబూలం వేసుకున్నట్లు లేదా కిళ్ళీ నమిలినట్లు కలగంటే స్నేహితులతో విరోధము గలిగే సూచనలున్నట్లు గమనించాలి.

★ కేవలం తాంబూలం కలలో చూడటం తటస్థిస్తే ధనలాభం.

★ ఇతరులెవరైనా తనకు ఆకులు–పోకలతో (వక్కలతో) కూడిన తాంబూలం ఇచ్చినట్లు కలగంటే స్త్రీ సంభోగప్రాప్తి. స్త్రీలైతే ప్రియుని సంగమిస్తారు.

★ కలలో పోకచెట్టుగాని; తమలపాకు తీగగాని కనిపిస్తే శుభకరమైనది.

★ కలలో సువాసన ద్రవ్యం జాజికాయ/లవంగాలను చూస్తే జీవితంలో అటుపోట్లకు కొంతకాలం గురికానున్నారని అర్థం.

★ వక్కలు ఒక మూటలో ఉన్నట్లు - అది దొరికినట్లు కలగనడం ధనలాభం.

★ మిరియాలు, ఆవాలు, ఉల్లివంటి ఘాటైన వస్తువుల్ని యథాతథంగా తిన్నట్లు కలగంటే దురదృష్టం వెంటాడుతుంది.

★ ఈ తరహా మసాలా దినుసులను నూరుకుని తినడం కలలో చూస్తే వ్యవహారంలో చిక్కులు.

★ ఆకుకూరలు తింటున్నట్లు కలగనడం వల్ల రోగప్రాప్తి.

★ కాయగూరలు భుజిస్తున్నట్లు కలలో కనిపిస్తే శుభదాయకం!

★ తెల్లని వస్తువుల్లో పత్తి, ఉప్పు, పెరుగు కలలో చూడడం కీడు.

★ కలలో నువ్వులు కన్పించడం మరణతుల్యమైన ప్రమాదాన్ని సూచిస్తుంది.

★ తన ఆకలి తీరిపోయినట్లుగా కలగన్నచో, సన్యాసి అవుతారు.

★ పంక్తి భోజనం చేస్తున్నట్లు కలగంటే, బంధువులతో విరోధం కలుగును.

★ తాను విషం సేవించినట్లుగా కలగన్నచో అంతవరకూ ఉండే వృత్తి/ఉపాధి మారిపోగలదు.

★ తేనె గాని, ద్రాక్ష రసం గాని, చెరుకురసం గాని త్రాగినట్లు వస్తే ధనలాభానికి సూచన.



★ తాను దాహంతో ఉన్నట్లు కలగన్నచో మనసు ఆందోళన చెందుతుంది.

★ ఎప్పుడూ ఆకలిగా ఉన్నట్లు కలలో కన్పించడం కీడును సూచిస్తుంది.

★ పిండి వంటకాలు మాడినట్లుగాని, ముదురు గోధుమరంగు తిరిగినట్లుగా గాని కలగంటే స్నేహితులకు ఆపదలు ప్రాప్తిస్తాయి.

★ తాను పాలు, పెరుగు తీసుకెళ్తూ అవి ఒలకపోసినట్లు కలగంటే రోగ సూచకం.

★ కంద, పెండలం మొ॥ దురద కలిగించే దుంపజాతుల్ని కలలో చూస్తే బలం కలుగుతుంది.

★ కలలో పాలుత్రాగినట్లు వస్తే రాజసన్మానము, కీర్తి కలుగుతాయి.

★ ఖర్జూరం, ఈత వంటి ఎడారి పండ్లు తిన్నట్లుగా కలగంటే దాంపత్య సుఖం బాగుంటుంది.

★ కేవలం నిమ్మకాయల్ని కలలో తిన్నట్లుగాని చూసినాగాని భార్యతో పేచీలు వస్తాయి.

★ మందు దినుసులు, ఓషధులుగాని ఏ విధంగా తిన్నట్లుగా కలవచ్చినా చిరకాలం నుండి పీడను చిక్కులు వీడిపోతాయి.

★ మందుకు చెందిన లేహ్యాం ఏదైనా తిన్నట్లు కలవస్తే లాభదాయకం.

★ మంచి రుచిగల మందు పుచ్చుకున్నట్లుగా కలవస్తే దాంపత్యానుకూలత ఉంటుంది.

★ కేవలం దాహంతో ఉన్నట్లు కలవస్తే కీడు.

★ చేదు/వగరు మందు తిన్నట్లు కలవస్తే దంపతుల మధ్య కలతలు.



★ తాను ఇతరులకు భోజనం పెట్టినట్లుగా కలగంటే ధనలాభం కలుగును.

★ బెల్లం, పంచదార తదితర మధుర పదార్థాలు తిన్నట్లు కలగంటే దరిద్రం.

★ వండిగాని, వండకుండాగాని మనుష్య మాంసం తిన్నట్లుగా కలగంటే గొప్ప సంపద కలుగుతుంది.

★ కలలో ఇతరుల దాహాన్ని తీర్చినా, ఇతరులకు సంతృప్తిగా పానీయాలు సరఫరా చేసినా మేలు కలుగును.

## 9. బంధు సంబంధమైనవి

మానవులందరికీ - ఏ ప్రాంతం వారైనా సరే! కలలో తరచుగా తమ చుట్టాలు, సమీప బంధువులు కొల్లలుగా కనిపిస్తుంటారు. ఇది ఆయా వ్యక్తుల మధ్య సన్నిహితత్వాన్ని బట్టి కూడా ఉండొచ్చు!

ఒక్కొక్కసారి కేవలం కన్పించడం మాత్రమే గాక, వివిధ చర్యలతో కలలు రావచ్చు! ఈ విభాగంలో ఆ తరహా కలల ఫలితాలు ఇచ్చాం!

**తల్లిదండ్రులు :** ఇద్దరూ కలిసి కలలో కనిపిస్తే శుభం. మరీ ముఖ్యంగా వారు మరణించినవారై (పితృ దేవతల కోవలోకి చేరినవారై) ఉంటే, వారి ఆశీస్సులు కలగన్నవారికి మెండుగా ఉంటాయి.

★ (బతికివున్న) తల్లిదండ్రులు మీతో మాట్లాడినట్లు కలవస్తే సంతానప్రాప్తి.

**కొడుకు :** తల్లిదండ్రులకు కొడుకు కలలో కనిపిస్తే (ఆ కలలో ఏ తీరుగా కనిపిస్తాడో అదే తీరుగా) ఇలలో కూడా కనిపించినట్లే జరుగుతుంది. ఉదా : ఓ కొడుకు తల్లిదండ్రులకు, దొంగతనాలు చేస్తున్నట్లు కల వచ్చిందనుకుందా!... ఇలలోనూ అదే తీరులో జరుగుతుంది.

**కూతురు :** తల్లిదండ్రులకు తమ కుమార్తె కలలో కనిపిస్తే అధికంగా వ్యయసూచన. కాపురానికి కూతురు వెళ్తున్నట్లు/వెళ్ళినట్లు కలరావడం మాత్రం శుభసూచకం.

**కవలలు :** కేవలం తమకు పుట్టిన కవలలేకాక, ఇతర కవలల్ని స్వప్నంలో ఎవరు దర్శించినా అంత మంచిది కాదు. అనారోగ్య సూచకం. కవలలను ప్రసవించినట్లుగా (స్త్రీలకు) కలగంటే కలహప్రాప్తి.



**అమ్మ :** .కూతురుకుగాని, కొడుకుకుగాని కేవలం తల్లి కలలో కన్పిస్తే శుభం. కేవలం తల్లిని మాత్రమే (మరణించిన) కలగంటే జాగ్రత్తగా ఉండమని ఓ హెచ్చరిక చేసినట్లు, జీవించి ఉన్న తల్లి కలలో కనబడి, ఆశీర్వదిస్తే ఆ దీవెనకు కలలోగాని - ఇలలోగాని తిరుగులేదు.

**నాన్న :** మరణించిన తండ్రిని కలలో చూస్తే, రాబోవు కాలంలో కష్టనష్టాల్ని ధైర్యంగా ఎదుర్కొంటారు. తండ్రినుంచి మీరు డబ్బు తీసుకుంటున్నట్లు కలగంటే, మీరు త్వరలో ఏదో విలువైన వస్తువు పోగొట్టుకుంటారని సూచన. బ్రతికి ఉన్న తండ్రిని కలలో దర్శించినట్లయితే ధనలాభం.

**భర్త :** ఏ స్త్రీకి అయినా కలలో భర్తను మాత్రమే చూస్తే ఆయుర్వృద్ధి. ప్రక్కన ఇతరులెవరైనా ఉంటే ఫలితం శూన్యం. భర్తతో సుఖిస్తున్నట్లుగా కలవస్తే అనారోగ్యం. భర్త మాట్లాడినట్లు కలగంటే శుభవార్తా శ్రవణం.

**భార్య :** ఏ పురుషునికైనా కలలో భార్య కన్పిస్తే, ఉద్యోగంలో అభివృద్ధి. మాట్లాడినట్లు కలగంటే సుఖభోజనప్రాప్తి. భార్యతో కామకేళి భయదాయకం.

**తాత :** (ఎటునుంచి అయినా) తాత వరసవారు గాని, తాతగాని కన్పిస్తే మిత్ర సహకారం దండిగా లభిస్తుందని అర్థం. తాత నవ్వినట్లు వచ్చే కల శుభం.

**మనవడు :** కలలో మనమడు నవ్వినట్లు కలరావడం శుభసూచకం. పోట్లాడినట్లు వచ్చే కల అనారోగ్యం.

**మనుమరాలు** : కలలో మనుమరాలు కన్పించడం విజయసూచకం. పోట్లాడినట్లు కలవస్తే ప్రమాదం.

**నాయనమ్మ** : కలలో ఈవిడ దర్శనం అకారణ భయదాయకం. కాని, ఆశీర్వదిస్తే మాత్రం కార్యక్రమాలు విజయవంతం అవుతాయి.

**అమ్మమ్మ** : అమ్మమ్మ కల్లోకి రావడం అనారోగ్యకారకం. దీవిస్తే శుభం.

**పసిపిల్లలు** : వరుస గలవారికి కాక, ఇతరులకు పసిపిల్లలు కనిపిస్తే అకారణ భయం. పైగా ఏడుస్తూ కనిపిస్తే మరిన్ని కష్టాలు. మురికిగా కన్పిస్తే అపనిందలు.

**ఆయా** : ఆయా కలలో కనిపించినా, కలలో లాలించినా ఎన్నో శుభపరిణామాలు కలుగుతాయి. ఆడవారు ఆయాలైనట్లుగా కలగంటే త్వరలోనే అట్టివారికి వివాహ సూచన ఉన్నట్టు.

**సవతితల్లి** : తండ్రితో కూడా కలసి సవతితల్లి కలలో కనిపిస్తే చాలా కష్టాలు ముందున్నాయని అర్థం! కేవలం సవతి తల్లి మాత్రమే కనిపిస్తే పేచీలు.

**పెదనాన్న** : కలలో ఈయన దర్శనం త్వరలో గొప్ప విందు భోజనం ప్రాప్తి. ఏదైనా ఇస్తున్నట్లు కలగంటే వ్యాజ్యకారకమైన కష్టాలు.

**వదిన** : కలలో కనిపిస్తే శుభం. ఆమె నవ్వించదనుకోండి! అనురాగప్రాప్తి. వదిన సంభాషిస్తున్నట్లుగా కలగంటే మీకు స్థానచలన సూచనలున్నాయి. అన్నతో సహా వదిన కనబడటం ఆయుర్వృద్ధికి సూచన.

**బాబాయి** : పినతండ్రి లేదా బాబాయి కలలో కనిపిస్తే కోర్టు వ్యవహారాల్లో మీదే గెలుపు. ఏదైనా ఈయన వద్దనుంచి పుచ్చుకుంటున్నట్లు వచ్చేకల తల నొప్పిని తెస్తుంది.

**పెదతల్లి** : ఈమె స్వప్నంలోకి రావడం స్థలం మార్పునకు సూచన. మాట్లాడినట్లు వచ్చే కల ధనకారకం.

**పిన్నమ్మ** : ఈమె చేతి వంట తిన్నట్టు కలరావడం ఆకస్మిక ధనలాభ సూచకం. ఈమె దీవెనతో కూడిన కల శుభవార్తా శ్రవణం.

**అత్త** : కలలో అత్తను దర్శిస్తే ఆప్తులతో సంతోషగా గడుపుతారని అర్థం. ఆమె మరణించినట్లు కలగంటే ధనలాభం. మీరే అత్త అయినట్లుగా కలగంటే దుష్టసంకల్పాలు కలుగుతాయి.

**మామ** : కలలో మామను చూడ్డం మీరు ఊహించని మంచి కబురు మీకు అందుతుందనడానికి సూచన.

★ కలలో అత్త మామ ఇద్దరూ జంటగా కనిపిస్తే మీకు సౌఖ్యవంతమైన జీవితంగాని/విందు వినోదాలతో కూడిన ప్రయాణంగాని ఉన్నట్లు.

**మేనత్త** : కలలో మేనత్త కనిపిస్తే ధనలాభం. మిమ్ములను ప్రేమించినట్లుగా కలగంటే అనారోగ్యం.

**మేనమామ** : కలలో మేనమామ దర్శనం శుభవార్తా శ్రవణాన్ని సూచిస్తుంది. ఆడపిల్లలకు మేనమామ కలలో కనిపిస్తే ప్రేమించినట్లు ధైర్యంగా చొరవగా ప్రవర్తించగల నేర్పు ఉన్నట్లు.

**మేనకోడలు** : మేనకోడలు కలలో కనబడితే ఆరోగ్యాభివృద్ధి. ఈమె నవ్వినట్టుగా కలగనడం నూతన అలంకార వస్తుప్రాప్తి.

**మేనల్లుడు** : కలలో మేనల్లుడు కనిపిస్తే చిక్కులు వస్తాయి. మేనల్లునితో పోట్లాట సంభవిస్తే దరిద్రం నుంచి విముక్తులవుతారు.

**అన్న** : కలలో అన్న కనిపిస్తే గౌరవ మర్యాదలు లభిస్తాయి. సోదరుడు మాట్లాడినట్లు కలవస్తే ఆరోగ్యాభివృద్ధి ఉంటుంది. సోదరునితో పోట్లాట జరిగినట్లు కలగంటే, మీ మిత్రునితో మీకు వివాదం ఏర్పడుతుంది.

**తమ్ముడు** : కలలో తమ్మునితో మాట్లాడితే, మీలో ఆదరభావం పెంపొందుతుంది. సోదరుని చేతినుంచి ఏదైనా పుచ్చుకున్నట్లు కలగంటే, మీకు అమూల్యమైన వస్తువు లభించనున్నదని అర్థం. ఏడుస్తూ చిన్నవాడు (మీకంటే) కలలో కనిపిస్తే మీకు బరువు బాధ్యతలు పెరుగుతాయి.

**అక్క** : తల్లి తదుపరి తల్లి వంటిది కనుక, అక్క కలలో కనబడితే సంతోషం లభిస్తుంది. అక్క కలలో పోట్లాడినట్లు కనిపిస్తే, మీకు అనారోగ్యసూచన. మీకెదురుగా నవ్వుతూ వస్తే, మీ సుఖసంతోషాలకు లోటు ఉండదు.

**చెల్లి** : సోదరి కలలో కనిపిస్తే, మీరు ఇతరులపట్ల అసూయతో ఉన్నారని అర్థం. ఆమెతో పోట్లాడినట్లుగా కలవస్తే మీకు ఆనందప్రదం.

**మరదలు** : ఈమెను స్వప్నంలో నవ్వినట్లు చూస్తే అనారోగ్యం. కేవలం కనిపిస్తే సంతానప్రాప్తి. మీతో మాట్లాడినట్లు కలవస్తే అదృష్టం!

**ఆడబిడ్డ :** ఈ వరస కలిగినామె కలలో కనిపిస్తే విలువైన వస్తువులు కోల్పోతారు.

**బావ (మరిది) :** ఇతన్ని కలలో చూస్తే గౌవరం. (స్త్రీలైతే) కలలో కనిపిస్తే మరియు మాట్లాడితే కష్టాలు. పెళ్ళాడినట్టు కలవస్తే అనారోగ్యప్రాప్తి.

**అల్లుడు :** కలలో అల్లుడిని చూడటం అన్ని విధాలా మంచిని సూచిస్తుంది. చాలా కాలంగా నిలబడిపోయిన పనులలో కొన్ని పూర్తవుతాయి. కలలో అల్లుడు నవ్వితే అన్నిరంగాల్లో మీరు ప్రగతి సాధిస్తారు. అయితే కూతురుతో సహా అల్లుడు కనబడితే మీకు అనారోగ్య ప్రాప్తి. అల్లుడితో పోట్లాడినట్లు కల ప్రతికూలత.

**కోడలు :** కలలో కోడల్ని చూడటం అంటే, మహాలక్ష్మిని ఆహ్వానించడమే! ఆమెని పీడించి వేధించినట్లు కనే కల, ఇలలోకూడా మీకు పీడను కల్గిస్తుంది.

**తోడికోడలు :** ఈమె కలలో కనిపించడం కుటుంబంలో చిక్కులకు మూలం. ఈమె మీతో పోట్లాడినట్లు వచ్చే కల మీ పనుల సాఫల్యానికి రాదారి వంటిది.

**తోడల్లుడు :** కలలో ఇతడి దర్శనం మిత్ర సహకారానికి నిదర్శనం.

(పూర్వీకులు నిర్ధారించిన ఈ అంశాల్ని సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే, ఫలానా బంధువు వల్ల పూర్తిగా మంచిగానీ, పూర్తిగా చెడుగానీ జరుగుతుందనడానికి ఆధారాలు లేవు. కనుక పై చుట్టాలు కలలో కనిపించి ఏ చర్య చేశారో... అనగా – నవ్వారో, పోట్లాడారో, మాట్లాడారో గుర్తుంచుకుని ఫలితాలు సరిచూసుకోవడం ఉత్తమం!)

## 10. నానావిధమైన కలలు

(ఇంతవరకు పేర్కొన్న వివిధ విభాగాలకు చెందనివి, అవర్గీకృతమైనవి నానారకాల కలలను ఈ విభాగంలో చేర్చడం జరిగింది)

★ సముద్రపు ఒడ్డున అలల తాకిడికి లోపలికి బైటికి నెట్టివేయబడుతూ కలగన్నచో కష్టాలు కలుగుతాయి.

★ ఏదైనా పాత్రతో నీరు ముంచుకొని, కాళ్ళు కడుక్కుంటున్నట్లు కలగన్నచో విందుభోజనం, ఆరోగ్యప్రాప్తి.

★ అనంతంగా హద్దుల్లేని భూమి కనిపిస్తే తరగనంత ఆనందం మీ జీవితంలో చోటు చేసుకుంటుంది.

★ పచ్చగడ్డి మోపు తలకెత్తుకున్నా, దించినా, దాన్ని మోస్తున్నా వచ్చే కల శుభసూచకం.

★ బీడువారిన భూమిలో నిలుచున్నట్లు కలవస్తే ఇతరులతో విరోధం కలుగుతుంది.

★ మిత్రులతో గుహలో తలదాచుకొన్నట్లు లేదా గడిపినట్లు కలవస్తే విరోధకారకం.

★ తాను గృహాన్ని నిర్మించుకుంటున్నట్లుగా కలగనడం కార్యసిద్ధి సాధకం.

★ ఎండలోకి వచ్చినట్లు కలగంటే, చిరకాలము నుండి బాధించే ఆపదలు దూరం కాగలవు.

★ కుంపట్లలోంచి చెట్టు మొలిచినట్లు కనిపిస్తే రహస్యాలు వెల్లడవుతాయి.

★ బీడుభమిలో నిల్చినట్లుగా పెళ్ళికాని వారికి కలవస్తే వివాహం వాయిదా పడగలదు.

★ తోటలో షికార్లు చేస్తున్నట్లు కలగంటే కష్టనష్టాలు కలుగుతాయి.

★ నిచ్చెన దాటినట్లు, ఇళ్ళ వరుస దాటినట్లు కలగన్నచో ఆపదలనుంచి గట్టెక్కుతారు.

★ నీరు పుక్కిలించి ఉమ్మినట్లు గాని కలవస్తే ఇదే ఫలితం కలుగుతుంది.

★ నీళ్ళలోని నాచు, కాళ్ళకు పట్టుకొన్నట్టుగా వస్తే ధనలాభం కలుగుతుంది.

★ తల పైకెత్తి ఈత ఈదినట్లు కలగన్నచో తలచిన కార్యాలు నెరవేరతాయి.

★ కాలువల ద్వారా నీరు పంట పొలాల్లోకి ప్రవహించినట్లు కలగనడం ధనలాభ సూచకం.

★ ఓడ/పడవ ఎక్కినట్లు కలగన్నచో దూర ప్రయాణ సూచనలుంటాయి.

★ నీటమునిగి, కొంతదూరం ఈది - ఇంకోచోట తేలినట్లు కలగంటే వర్తకులకు నష్టం; ఇతరులకు ఆపదల నుంచి గట్టెక్కే కార్యలాభం.

★ మురికినీటిలో తెప్పలపై ప్రయాణిస్తున్నట్లు కలగంటే వ్యాధికారకం.

★ మసిలే/మరిగే నీళ్ళతో స్నానం చేస్తున్నట్లు కలగంటే బంధువులకు ఇబ్బందులు.



★ మంచినీటి బావిని కలలో దర్శించడం ధనప్రాప్తి.

★ చుట్టూ జలమయమై నిలువనీడ లేనిచోట వరద తగ్గుముఖం పట్టినట్లు కనే కల కష్టాల్ని తీర్చగలదు.

★ బావిలోంచి తోడేనీరు మురికినీరువలె కనిపిస్తే కష్టాలకు మూలం.

★ బావినుంచి నీరు పొర్లిపోయి కారిపోతున్నట్లుగా కలవస్తే ధననష్టం (పురుషులకు).

★ ఇదే కల స్త్రీకి వస్తే భర్తకు ఆపద. కన్యకు వస్తే రోగసూచకం.

★ చల్లటినీరు తాగుతున్నట్లు కలగంటే సుఖసంతోషాలు కలుగుతాయి.

★ ఆవిర్లు వచ్చేంత వేడినీటిని తాగుతూన్నట్లు వచ్చేకల వల్ల ఓర్వలేని వారిచేత కష్టాలు.

★ ఏదైనా పాత్రతో నీటిని త్రాగవలసిందిగా ఇస్తే సంతాన మూలక సుఖం.

★ ఇల్లంతా నీటిమయమైనట్లుగా కలవస్తే కష్టనష్టాలు తప్పవు.

★ చిల్లు కుండతోగాని - నీళ్ళు కారిపోయే గుడ్డసంచితో గాని నీళ్ళు తోడుతున్నట్లు కలగంటే, బాగా నమ్మినవారే ద్రోహం చేస్తారని గ్రహించాలి.

★ సువాసనగల పుష్పాలను తలలో ముడుచుకున్నట్లు, జడపాయలలో ధరించిట్లు కలగన్నచో ఆనంద సూచకం.

★ కేవలం పుష్పాలను సూచిస్తే (కలలో) ఆనందం.

★ పుష్పాలు ఏవైనా గాని కలలో దర్శిస్తే ఇంట్లో శుభకార్యాలు జరగవచ్చు!

★ భజన/నాట్యం/హరికథ... ఇట్టివి సుఖజీవనం కలిగిస్తాయి.

★ గుడిని మాత్రమే కలలో దర్శిస్తే కలహం.

★ దేవునితో సహా గుడిని చూసినా, దేవునికి పూజ చేస్తున్నట్లు కలలో కనిపించినా ప్రయత్నిస్తూన్న కార్యాలు ఫలవంతం కావు.

★ కలలో పూలను వాసనచూస్తే స్త్రీ సంభోగం - సుఖానుభూతి కలుగుతాయి.

★ దొంగతనం చేసినవారికి, వాడినపూలు కలలో కనిపిస్తే, ఆ దొంగతనం అంత త్వరగా బైటపడదు.

★ పువ్వులు ఏరుకుంటున్నట్లు కలగంటే కార్యసిద్ధి. అనుకూల దాంపత్యం.

★ పుష్పాలున్న చెట్లను కలలో చూస్తే సంతానప్రాప్తి కలుగుతుంది.

★ చేతిలో పువ్వులు పట్టుకొన్నప్పుడు, అది వాడినట్లు కలగన్నచో కార్యహాని, లేదా సంతాన నష్టం.

★ పచ్చికాయలు గల చెట్లను చూస్తే కార్యహాని.

★ పళ్ళతో ఉన్న చెట్లను చూస్తే ద్రవ్యలాభం.

★ వానలు-వరదలు కురిసినట్లు కలగంటే దేశంలో రోగప్రాప్తి.

★ ముత్యాలు, రత్నాలు కలలో కనిపించడం శుభం.

★ బంగారు మురుగులు/కంకణాలు ఎవరైనా మీకు బహుమతిగా ఇస్తే, మృతనష్టపు ఆస్తి మీకు కలిసొస్తుందని అర్థం.

★ గడియారం గంటలు కొడుతుండగా విన్నట్టు కలగంటే సంతానలాభం, మర్యాద, సుఖజీవనము కలుగుతాయి.
★ ఏ విధంగానైనా సరే! గడియారాన్ని కలలో సందర్శించడం శుభకరమే!
★ కలలో ఇనుము/స్టీలు కనిపించినచో దరిద్రం.
★ కలలోనైనా సరే! బంగారాన్ని పారేయకండి!... మీకు చోరభయం సూచన.
★ కలలో ఇత్తడి కనిపిస్తే మోసపోతారని అర్థం.
★ కలలో సీసం కనిపించినచో ధనవంతులకు వివాదాలు కలుగుతాయి.
★ మీరు ఇతరులకు బంగారు నాణేలు ఇచ్చినట్టుగా కలగంటే స్నేహితులు వృద్ధి అవుతారని అర్థం!
★ కలలో రజతం (వెండి) ఒక ముద్దవలె చూసిన కీడు. ఆభరణాలు శుభం.
★ తెల్లని కాగితాల బొత్తి/ కట్ట కలలో కన్పించడం శ్రేష్టం.
★ పైన చెప్పిన లోహధాతువులు కాక ఇతర గుర్తుపట్టలేని లోహాలుగాని - వస్తువులు గాని కలలో కనిపిస్తే కష్టనష్టాలు; ఆర్థిక ఇబ్బందులు.
★ అద్దం (పాదరసం పూతతో సహా) కనిపిస్తే ధనవంతులకు ధనహాని, లేనివారికి ధనలాభం.
★ ఏదైనా జాతకచక్రంగాని కలలో కనిపించడం జరిగితే గొప్ప వ్యవహారవేత్త అవుతారు.
★ తను పుస్తకాలుగాని, కాగితాల కట్టలుగాని మోసుకొని పోతున్నట్లు కలగన్నచో కష్టనష్టాలు.
★ ఏదైనా గోడలకు తగిలిస్తున్నట్లుగా గాని, అంటిస్తున్నట్లుగా గాని కలగన్నచో దుఃఖప్రాప్తి.
★ కొత్త పాదరక్షలు ధరించుచున్నట్లు కలగన్నచో స్త్రీతో సంభోగప్రాప్తి
★ పాత పాదరక్షలు ధరించుచున్నట్లు కలగన్నచో దరిద్ర సూచన.
★ తనకు వార్ధక్యం సమీపించినట్లు కలగన్నచో అధిక ఆయుర్దాయ ప్రాప్తి.
★ బంతి ఆట చూచినుట్ల కలగన్నచో సుఖజీవనము కలుగును.
★ తాను సంగీతం పాడుచున్నట్లుగా కలగంటే దుఃఖసూచకం.
★ తాను నాట్యప్రదర్శనను చూస్తూ, ప్రక్కనున్న వారితో ఏదో ముచ్చటిస్తున్నట్లు కలగన్నచో పోయిన సొమ్ము దొరుకుతుంది.
★ తాను చదరంగం ఆడుతున్నట్లుగా కలగంటే, అయిన వారితోనే పోట్లాట సంభవించి - అది ఒకరిపైనొకరు చేయి చేసుకొనేంత వరకు వెళ్ళవచ్చు!
★ తాను చీట్లపేక ఆడుతున్నట్లు కలగంటే జారపురుషుడవుతాడు.

★ ఇదే ఆటలో తన చేతిలోని ముక్కలలో ఎక్కువ బొమ్మలు ఉంటే సంతానవృద్ధి. కేవలం అంకెలైనచో సంతాన సౌఖ్యం తగ్గుతుంది.

★ తాను అశుద్ధాన్ని/పెంటను పూసుకున్నట్లు కలగన్నచో ధనలాభం.

★ తాను పెంటపై/ మలంపై నిలబడినట్లుగా కలగంటే శత్రువిజయం, కార్యలాభం.

★ కలలో ఏదైనా గోతాం / మూట / బస్తా వంటివి కనిపిస్తే సంతాన సౌఖ్యం.

★ దులిపిన సంచీని బయటపారేసినట్లుగా కలవగ్నచో, బాగా కావలిసిన వారికి ఆరోగ్యభంగం.

★ ఎవ్వరో గణగణ గంటలు మ్రోగిస్తున్నట్లుగా కలవస్తే శుభవార్తా శ్రవణం.

★ తాను బంతి ఆట ఆడుతున్నట్లు కలగన్నచో గొప్ప ఆస్తికి వారసుడవుతాడు.

★ పురుషులకు కలలో కోతులు కనిపించి నవ్వుతున్నట్లు పాడుతున్నట్లు రకరకాలుగా విన్యాసాలు చేసినట్లుయితే, వారు ఆశించిన స్త్రీ లభించినట్లే లభించి చెయ్యి జారిపోగలదు.

★ తమ ఇంటి పెరట్లో పలు పండ్ల మొక్కలతో కూడిన తోటను కలలో చూడగలిగితే భార్యాపుత్రులవల్ల కీర్తిప్రతిష్టలు తథ్యం.

★ మెట్లులేని ఇరుకుదారులతో కూడిన కొండను ఎక్కినట్లుగా కలగన్నచో ఎన్నో ఆపదలకు మూలం అని గ్రహించాలి.

★ నిండుగా ఉన్న చెరువు మధ్య కూర్చొని, తామరాకులో భోజనం చేసినట్లుగా వచ్చే కల ప్రభుత్వాధికారిని గాని / ప్రజాపాలకుని గాని చేస్తుంది.

★ సువాసనతో కూడిన వాయువులు / సెంట్లు / అత్తర్లు వీటిని పీల్చినట్లు కలగంటే కీర్తిపరులవుతారు.

★ ఇంటిలోపల నక్షత్రం ప్రకాశిస్తున్నట్లుగా కలవస్తే, ఆ ఇంటివారికి కీడు కలుగుతుంది.

★ నిప్పు / అగ్ని / మంట కలలో కన్పించడం శ్రేష్ఠం!
పై కల తరచుగా రాకూడదు. అది ఆగ్రహావేశాలను పెంచుతుంది.

★ దీపం / కాగడా / దివిటీ వంటివి ప్రకాశవంతంగా వెలుగుతున్నట్లు కలవస్తే మంచిది. వర్తకులకు పై కల ధనలాభాన్ని కల్గిస్తుంది.

★ అవివాహితులకు ఇదే కల వివాహ ప్రాప్తిని కలిగిస్తుంది.

★ పొగ గాని - మంటగాని లేని నిప్పుగుండం కలలో బూడిదతోకూడివున్నచో విషాదవార్త.

★ కాని, ఇటువంటి కల అనారోగ్యంతో బాధపడేవారికి స్వస్థత చేకూర్చును.

★ దీపం - కాగడా వెలగలేక వెలుగున్నట్లు కలవచ్చినా అనారోగ్యం తగ్గుతుంది.

★ వెలిగించిన దీపం ప్రకాశిస్తున్నట్లు కలగన్నచో ప్రతిష్ఠ పెరుగుతుంది.

★ ఇదే దీపం పదే పదే ఆరిపోతున్నట్లుగా కలగాని వస్తే ఎన్నో కష్టాలు-పుత్రశోకం కలుగుతాయి.

★ దీపం/కాగడా తాను వెలిగించి తనకోసమే ఏదో వెతుక్కుంటున్నట్లుగా కలవస్తే, ఆపదలు తొలగిపోయి బంధుపోషణ, లోకాదరణ కల్గుతాయి.

★ ఎవరిచేతిలోనైతే కాగడా విశేషంగా వెలగకుండా వుంటుందో, అటువంటి వారు చేతుల్లో కాగడా ధరించి మనకు కలలో కనిపిస్తే - వారివల్ల మనకు ఇబ్బందులు కలుగును.



★ తన చేతిలో దీపం (వెలిగించినది) ధరించివున్న స్త్రీ, కడుపుతో ఉంటే - అటువంటి కలగన్నందుకు ఆమెకు దీర్ఘాయుష్మంతుడైన కుమారుడు ఉదయిస్తాడని స్వప్నశాస్త్రమున గలదు.

★ తాను దీపధారి అయి, అట్టి దీపములు కలయందు సభలోనికి తీసుకొని పోవుటచేత పేరు ప్రఖ్యాతులు కలుగును.

★ చక్కగా వెలుగుతున్న దీపాన్ని నోటితో ఊది ఆర్పినట్లు కన్న కలవల్ల అన్నీ విపరిణామాలు సంభవించును.

★ అగ్ని ప్రమాదాలకు సంబంధించి చిత్ర చిత్రాలైన కలలు వేరు వేరుగా ఫలితాలను సూచిస్తాయి. పెరటివైపు కాలుతున్నట్టు కలవస్తే, స్త్రీలకు మరణం దగ్గర పడిందంటారు.

★ వీధివైపు కాలుతున్నట్టుగాని- ముందున్న కిటికీలు అంటుకున్నట్టుగాని కలవస్తే, తమ సమీప బంధువులకు చేటు అని గ్రహించాలి.

★ ఇంటి కప్పులో నడికొప్పు (మధ్యభాగం) అంటుకున్నట్లుగా కలవస్తే, తమ సొత్తుకు చోరభయం ఉందని తెలుసుకోవాలి.

★ ఉమ్మడి కుటుంబంలో ఉండి, పెద్ద ఇంట్లో కుటుంబసభ్యులు నివశిస్తూ ఉన్నప్పుడు ఏ భాగం అంటుకున్నట్లుగా కలవస్తే, ఆ భాగంలోని వారికి కష్టాలు సంప్రాప్తిస్తాయి.

★ మరొక అభిప్రాయం ప్రకారం వంటిల్లైతే స్త్రీలకు, శాల అయితే పశువులకు, పడగ్గది అయితే దంపతులిద్దరికీ; ముందుగది అయితే సంతానానికీ కష్టకాలం అని గుర్తించారు.

★ పెద్ద పెద్ద మంటల్తోబాటు నిప్పురవ్వలు ఎగురుతూ, పొగకూడా తోడయ్యి ఇల్లు కాలుతున్నట్లుగా కలవస్తే అతి త్వరలో ఆ ఇంట కోలుకోలేని కీడు కలుగునని తెలుసుకోవాలి.

★ ఇంటి సింహద్వారం మొదట అంటుకున్నట్లుగా కలవస్తే, యజమానికి కీడుగా గ్రహించాలి.

★ బంధువుల లేదా మిత్రులయొక్క ధరించినట్టి దుస్తులు అంటుకున్నట్లు కలవస్తే, వారికి రోగబాధ.

★ పందిరిమంచం నలుదిక్కులా మండుతున్నట్లు కలగన్నచో తమ పురుష సంతానం ఎక్కువగా బలపడుతుందని తెలుసుకోవాలి.

★ అయితే అది మంటల్లేకుండా, కేవలం కర్రలు కాల్తున్నట్లు (నిప్పుతో కూడుకుని కొరకంచువలె) కనిపిస్తే పురుష సంతానం హీనం కాగలదు.

★ ఎవరికైనా తమ దేహం కాలుతున్నట్లుగా కలవస్తే లేదా మంటలచేత బాధింపబడు తున్నట్టుగా కలవస్తే రోగబాధ అని అర్థం.

★ కుప్పబోసినట్లుగా ఉన్న ధాన్యం తగులబడుతున్నట్టుగా వస్తే అతివృష్టి గాని - అనావృష్టిగాని ఏర్పడవచ్చు!

★ అయితే, ఆ ధాన్యం రాశినుంచి మంటలు పైకి ఎగిసినట్లుగా మాత్రమే కలవస్తే పంటలు సమృద్ధి.

★ ఇదేవిధంగా కేవలం మంటలు మాత్రమే పైకి ఎగిసినట్లుగా - ఇళ్ళనుంచి మంటలు బయల్వెడలినట్లు కలవస్తే ప్రభుసన్మానం, రాజపూజ్యత.

★ కేవలం చేతులయొక్క వ్రేళ్ళు కాలుతున్నట్లు కలగంటే, తమ ప్రమేయం లేకుండానే ఏవో చెడుపనులకు సిద్ధపడవలసి వస్తుంది.

★ ఆకాశంలో ప్రమేయం లేకుండా నక్షత్రాలు ప్రకాశిస్తున్నట్లు కలవస్తే లాభం.

★ ఆకాశం మబ్బుల్లేకుండా నిర్మలంగా ఉన్నట్లు కలవస్తే, ఆశించిన పనులు నెరవేరతాయి. తెలిమబ్బులు దూరంగా జరిగిపోతున్నట్లు కలవస్తే, పోయిన ఆస్తి తిరిగి దొరుకుతుంది.

★ దట్టంగా నల్లని మబ్బులుపట్టి ఉన్న ఆకాశం కనిపిస్తే, ఆపదలు చుట్టుముడతాయి.

★ ఎక్కడికక్కడ తెల్లమబ్బులు పట్టినట్లుగా కలవస్తే, బాగా కావలసినవారు వ్యాధిగ్రస్తులు కాబోతున్నారని అర్థం!

★ అవివాహితులకు ఈ కలవస్తే త్వరలోనే వివాహమవుతుంది.

★ మబ్బులేవీ లేకుండా, తనకు తగలకుండా దగ్గర్లో పిడుగు పడినట్లుగా కలగంటే దూరదేశ ప్రయాణాలుంటాయి.

★ ఇదే కల బాటసారులకు వస్తే, ప్రయాణాల్లో విఘాతాలు కలుగుతాయి.

★ కలలో ఉరుములు, మెరుపులవల్ల తాను భయభ్రాంతుడైనట్లుగా కలగంటే సమీపంలో పిడుగులు పడినట్లుగా కలగంటేనూ ఆపదలు.

★ పిడుగులు ఆర్భాటంగా వచ్చి, మీద పడకుండా ఎటో వెళ్లిపోయినట్లు గాని, చీకట్లో దారిగానక ఇబ్బందులుపడుతూ, మెరుపుకాంతి వల్లనే దారి చూసుకుంటు న్నట్లుగాను కలవస్తే ఆపదల నుంచి తక్షణమే విముక్తి.

★ బాగా మబ్బులు పట్టి ఉన్నప్పటికీ, వానలేకుండానే, కేవలం ఉరుములు వింటున్నట్లు వర్తకులు కలగంటే, అది వారికి లాభదాయకం.

★ ఇదే కల ఇతరులకు అయితే, తమ బంధువులవల్ల ఆర్థిక ప్రయోజనం.

★ సూర్యాస్తమయం మబ్బులవల్ల జరిగినట్లుగా కల వచ్చిన అపనిందలు.

★ సూర్యుడు తన ఇంటి పైననే అస్తమిస్తున్నట్లుగా కలగన్న, ఇల్లు కాలిపోగల ఫలితం.

★ కొంతమేర సూర్యబింబం గ్రహణం పట్టినట్లు కలలో కనిపిస్తే ఇంట్లోని వృద్ధులకు చేటు.

★ సూర్యకిరణాలు వాస్తవంగా ఎంతమేలు చేయగల్గునో కలల్లోని కొన్ని సందర్భాలలో అంత కీడు చేస్తాయి. సూర్యరశ్మి పడకపై పడితే నిజజీవితంలో సూక్ష్మక్రిములు నశిస్తాయి. కానీ సూర్యకాంతి పడకపై పడినట్లు కలగంటే రోగకారకమైనదని స్వప్నశాస్త్రం చెప్తోంది.

★ నేరం చేసిన వారికి లేదా తమ నేరాలు వెల్లడవుతాయని భయపడే వ్యక్తులకు ఈ కలవల్ల మేలే జరుగుతుంది.

★ కేవలం సూర్యాస్తమయం కలలో కనిపిస్తే కీడు, అపనిందలు కలుగును.

★ నక్షత్రాలపై మబ్బు కమ్మినట్లుగా గాని, అవి ఒకదాని తర్వాత ఒకటి మిణుకు మిణుకుమంటూ అప్రకాశంగా వెలిగినట్లుగా గాని కలవస్తే, కష్ట నష్టాలు చేరువలోనే ఉన్నట్లు అర్థం!

★ ఇంటిమీద నక్షత్రాలు రాలినట్లుగా కలవస్తే అనారోగ్యం. కుప్పలా రాలినట్లు కలగనడం అగ్నిప్రమాద సూచన. పెద్దకాంతిగల నక్షత్రం ఇంటిమీద వేగంగా పడినట్లు కలవస్తే త్వరలోనే ఆ ఇంటిని విడిచిపెడతారని అర్థం!

★ ఆకాశంలో నక్షత్రాలు లేవు అనే సంశయం కలిగితే... దారిద్ర్య సూచకం. ఇటువంటి కల సంపదగలవార్ని సైతం దరిద్రుల్ని చేస్తుంది.

★ తోకచుక్కలు కలలో కనబడినా ఆపదలు తప్పవు. ఇవి ఎవరి కలలో వచ్చినా, ఆ దేశంలో కాటకం సంభవిస్తుంది.

★ తోకచుక్కలు అతివేగంగా నేలరాలినట్లు కలగన్నచో దేశానికి అరిష్టం.

★ కలగన్న వారిని అష్టకష్టాలూ చుట్టుముడతాయి.

★ తమచుట్టూ సూర్యకిరణాలు చుట్టుకొన్నట్లుగా కలగన్నచో నేరస్తులకు శుభఫలితాలుంటాయి. వారు విడుదల కాగలరు.

★ ఇతరులకు ఇదే కలవల్ల సన్మానం - గౌరవాదరాలు కలగగలవు.

★ తూర్పు దిక్కున ఇంద్రధనుస్సు కనిపిస్తే ధనవంతులకు కీడు. డబ్బు లేనివారికి మేలు.

★ తనకు అతి సమీపంలోగాని లేదా తన తలమీదనే గాని ఇంద్రధనుస్సు ఏర్పడినట్లు కన్న కలకు కూడా ఇదే ఫలితం వర్తిస్తుంది.

★ దిక్కులు మారినచో... అనగా ఈ ఇంద్రధనుస్సు పడమటి దిక్కున కనుపించినచో ధనవంతులకు మేలు; ధనహీనులకు కీడు.

★ చంద్రునికి మానవ ముఖాకృతి ఏర్పడినట్లుగా కలవచ్చినచో, అది ప్రకాశవంతంగా ఉన్నట్లుగా రూపించినచో సంతానప్రాప్తి.

★ చంద్రకాంతి తన తలచుట్టూ వ్యాప్తి చెందినట్టు కల వచ్చినచో మంచిపేరు ప్రఖ్యాతులు కలుగుతాయి.

★ ప్రకాశవంతంగా, వెన్నెల కాచినట్లుగా కలవచ్చి, అందులో చంద్రుడు కనిపిస్తే అనుకూలమైన దాంపత్యం కలుగుతుంది.

★ చంద్రుని చుట్టూ మబ్బుపట్టినట్లుగాని లేక చంద్రగ్రహణం ఏర్పడినట్లు గాని కలలో చూస్తే అది గృహమందలి స్త్రీలకు కీడును కలుగజేస్తుంది.



★ అదే కల ప్రయాణిస్తూ వున్నవారికి గాని వస్తే, వెంటనే ఆపదలు పొంచి వున్నాయని గ్రహించాలి.

★ చంద్రునితో బంతి ఆట ఆడినట్లుగా కలవస్తే, కొద్దికాలంలో ఆ ఇంటిని దొంగలు దోచుకుంటారు.

★ చంద్రునిగాని - సూర్యునిగాని అద్దంలో ప్రతిబింబం మాదిరిగా చూసినచో అయినవారి వల్లనే కష్టనష్టాలు కలుగుతాయి.

★ స్త్రీల స్తనాలు పురుషులు చూసినట్లయితే, వారి ఉద్యోగవృత్తులు ఇనుమడిస్తాయి. జారిపోయిన - వ్రేలాడిపోతున్న స్త్రీల స్తనాలు పురుషులకు కలలో కనిపిస్తే నష్టాలే!

- ★ కలలో స్త్రీల మర్మావయం పురుషులకు దర్శనమైతే ప్రేమ కలాపాలు ఎక్కువ అవుతాయి.
- ★ స్త్రీ యోని స్త్రీలకు కలవస్తే ప్రయాణాలు చేస్తారు.
- ★ స్త్రీల స్తనాలను స్త్రీలే కలలో చూడడం జరిగితే సంతానవృద్ధి ఉంటుంది.
- ★ ఒకే స్తనాన్ని ఎవరు చూసినా అనుకోని ఆపదలు చుట్టుముడతాయి.



- ★ పురుషుల మర్మావయవాన్ని పురుషులే చూస్తే కలహాలు చేరువలో ఉన్నాయని అర్థం!
- ★ పురుషుల మర్మావయం స్త్రీ కలలోకి వస్తే ఆమె ప్రేమ వ్యవహారాల్లో విజయం సాధిస్తుందని చెప్పవచ్చు!
- ★ కృశించినట్లున్న పురుష మర్మావయం స్త్రీకి కలవస్తే అనారోగ్య సూచన.
- ★ ఒకటికంటే అధికంగా శిశ్నాలను స్త్రీ కలలో దర్శిస్తే, ఆమెకు దీర్ఘవ్యాధి సూచన.
- ★ స్త్రీల నునుపైన తొడల్ని పురుషులు కలలో చూస్తే, ప్రేమ కలాపంలో మునిగి తేలగలరు.
- ★ కన్యలకు పురుషుల తొడలు కలలోకి వస్తే ప్రేమ; వివాహిత స్త్రీ అయితే సంతానాన్ని పొందగలదని సూచన.
- ★ కృశించినట్లున్న తొడలు ఏ విధంగానైనా/ఎవరివైనా కలలోకి వస్తే విచారసూచకం.
- ★ గుండ్రంగా ఎత్తుగా ఉన్న స్త్రీల పిరుదులు పురుషుల కలలోకి వస్తే సంభోగ సుఖప్రాప్తి. పురుషుల పిరుదులు కలలోకి వస్తే కలహం.
- ★ స్త్రీలకు పురుషుల పిరుదుల శిశ్నంతోసహా ఏటవాలుగా ఉన్నట్లు కలలోకి వస్తే కోరిన పురుషునితో శయ్యాసుఖం.
- ★ మైథునక్రియ కలలోకి వస్తే స్త్రీలకు ధనప్రాప్తి, పురుషులకు సంభోగప్రాప్తి.
- ★ తాను నగ్నంగా ఉండగా, దిసమొలతో కూడిన స్త్రీ తనపై నెక్కి సంభోగ సుఖాన్ని పొందినట్లు పురుషునికి కలవస్తే, అతడు జారత్వములో అందె వేసిన చెయ్యి కాగలడు.
- ★ ఇదే కల స్త్రీకి వస్తే ఆమె తార్పుడుగత్తె కాగలదని అర్థం.
- ★ కొయ్యబల్ల/కుర్చీ/భోజనంబల్ల వంటి చెక్క సామగ్రి కలలోకి వస్తే అన్నీ శుభాలే.

★ కలలో పేడ కుప్పలోకి మీరు పేడ పోగుచేసి పెద్దకుప్పగా మార్చినట్లు చూస్తే, మీరు జీవితంలో కష్టపడి ఉన్నతస్థాయికి రానున్నారని సూచన.

★ కాలుజారి మీరు పేడలో పడినట్లు కలవచ్చినా అది శుభసూచకమే!

★ సీసాలు గాని పీపాలు గాని పెద్ద పరిమాణంలో ఉన్నవి కలలోకి వస్తే ధన లాభం. అయితే అవి ఏదో ఓ పదార్థంతో నిండిపోయి ఉండాలి.

★ అవే సీసాలు/పీపాలు ఎత్తునుండి పడిపోయి ముక్కలైనట్లు కలగంటే విషాదవార్తలు వింటారు.

★ ఖాళీవి కలలోకి వస్తే, ఉన్న ధనం నాశనం.

★ ఇంటగాని, బయటగాని వివిధ పరిసరాల్లో (ద్వారాలు/కిటికీలకు దండెం మీద) కట్టబడిన తెరలు కలలోకి వస్తే, మీ దగ్గర ఇతరులు రహస్యాలు దాస్తున్నారని అర్థం.

★ ఆ తెరలు మీరే కట్టినట్లు కలగంటే త్వరలోనే మీకు అపరిచితులతో మైత్రి ఉన్నట్టు సూచన. అయితే అవి తెల్లగా ఉండాలి:

★ రంగు రంగుల తెరలు ఎగురుతున్నట్లుగా కలవస్తే, మీ ఊహలు దుష్ట సంబంధాల వైపు మళ్ళగలవు.

★ మాసిన/చిరిగిన తెరలు కలలోకొస్తే సుఖశాంతులను దూరం చేస్తాయి.

★ వెదురుబద్దలతో కూడిన తడికెలు కలలోకి వస్తే దూరాలోచన లేని కార్యాల వల్ల మీ జీవితంలో కష్టాలు ప్రాప్తిస్తాయి.

★ వెదురు బుట్టలు / విసనకర్రలు వంటి మేదర వస్తువులు కలలోకి వస్తే, మీకు విచారం తప్పదు.

★ పిడకలు కాల్చిన బూడిద/ కట్టెలు/ఊక/పొట్టు వంటి కాల్చగా వచ్చిన బూడిద కల్లోకి రావడం అవమాన సూచకం.

★ బూడిదకుప్పలు లెక్కకు మిక్కిలిగా కనిపించినట్లయితే, మీ ఆత్మీయులకు ఏదో ప్రమాదం వాటిల్లబోతున్నట్లు అర్థం!

★ బూడిద ఎగురుతూ వచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టినట్లు కలగంటే, మీరు అప్పుల్లో ఇరుక్కోబోతున్నట్లుగా సూచన.

★ కేవలం నల్లటి మసి కలలో కనిపిస్తే, అది శుభసూచకం. త్వరలో మీకు ఉద్యోగం గాని/మీరు ఉద్యోగస్తులై ఉంటే పదోన్నతిగాని లభించవచ్చు!

★ రకరకాల అంగళ్లు ఉన్న బజారువీధిలో మీరే సంచరిస్తున్నట్లుగా కలగంటే, మీ కోరికలచిట్టా పెరుగుతున్నదని గ్రహించాలి.

★ ఏదైనా వస్తువును, బేరంచేసి ఖరీదు చేయకుండా వెళ్ళిపోతున్నట్లు కలగంటే, మీ విషయాల్లో ఇతరుల జోక్యం అధికం అవుతున్నట్లుగా గ్రహించండి.

★ బేరం ఆడకుండా, సరాసరి వస్తువును కొన్నట్లు కలగంటే మీరు చిక్కుల్లో పడనున్నారు.

★ మాదకద్రవ్యాలు/సారా/మత్తుపానీయం సేవిస్తున్నట్లుగా కలగంటే-మీరు దుబారా వ్యయం చేయడంలో ఘనులు కాబోతున్నారని అర్థం.

★ మిత్రులతో కూడి పైన చెప్పినవి సేవించడం కలలో చూస్తే మీ మిత్రుల వల్లనే మీరు మోసగించబడతారు.

★ కలలో మీకు ఉత్సవం/జాతర/వేడుక/ పండగలు చేసుకోవడం దర్శిస్తే మీ స్నేహితులకు త్వరలోనే మంచికాలం వస్తుందని అర్థం.

★ ఏదైనా విహారయాత్రకు వెళ్ళినట్లు కలవస్తే, మీ జీవితంలోకి మంచి రోజులు రానున్నట్లు అర్థం.

★ సంతకాలు, వేలిముద్రల వంటివి కలలోకి వస్తే మీకు అయినవారి సహాయం పుష్కలంగా లభిస్తుందని అర్థం.

★ పచ్చబొట్లుగాని, చిత్రమైన వర్ణాలుగాని కలల్లో శరీరంపైన చూస్తే, మీ రహస్యాలను ఇతరులు గ్రహించడానికి శతవిధాల ప్రయత్నిస్తున్నారని గ్రహించాలి.

★ ఊరగాయలు, పచ్చళ్ళు... ఇవి కలలో కన్పించడం వల్ల మీ ఆదాయం త్వరలోనే పెరుగుతున్నట్టుగా గుర్తించండి. కలలో ఈ పచ్చళ్ళు మీరు తింటున్నట్లు వస్తే, మీ బంధువుల్ని మీరు పైకి తీసుకురావడానికి శ్రమిస్తున్నారని అర్థం!

★ కలలో చింపిరిగుడ్డలు మీరే ధరించినట్లుగా వస్తే అనారోగ్య సూచన. ఇతరులెవరో కలలో ఈ తీరున కనిపిస్తే, మీకు మృతనష్టపు ఆస్తి కలిసొస్తుంది, వీటిని ఒక కుప్పగా వేసినట్లు కలగంటే మీ ఆదాయం పెరుగుతుంది.



## అశుభ సూచక స్వప్నాలు

★ తాను సూర్యచంద్ర గ్రహణాల్ని చూసినట్లుగా కలగన్నచో నేత్రరోగాలు సంప్రాప్తిస్తాయి.

★ సూర్యుని చుట్టూ ఎర్రనిరంగు పరుచుకొన్నట్టు కలవస్తే నేత్రదృష్టి తగ్గుతుంది.

★ నూనె, ప్రత్తిచెట్లు మొ॥ వాటిని చూస్తే ఆపదలు కలుగుతాయి.

★ నక్షత్రాలు రాలినట్లు కలగన్నా దుఃఖాలు కల్గుతాయి.

★ ఎర్రని వస్త్రాలు ధరించినట్లు కలగంటే రోగసూచన.

★ ఎన్నడూ పూలుపూయని చెట్లు పూలు పూసినట్లు కనబడితే దుఃఖకారకం.

★ ఆవుపాలు పిండినట్లు లేదా చూసినట్లుగా కలగంటే కుష్టురోగ ప్రాప్తి.

★ మురికినీళ్ళు త్రాగినట్లు కలగన్నా, నల్లగా దట్టంగా ఆకాశం మబ్బు పట్టినట్లు కలగన్నా వ్యాధికారకం.

★ బావినీరు నిండి పైకి వచ్చినట్లు పురుషులు కలగన్నచో స్త్రీకి-స్త్రీ కలగంటే పురుషుడికీ మరణం.

★ తన వంటిని గంధపు వస్త్రాలతో అలంకరించుకున్నట్లుగా కలగంటే త్వరలో మరణం.



★ రోగంతో ఉన్నవారికి తమ తల పొడవుగా - వెడల్పుగా పెరిగినట్లు కలవస్తే వ్యాధి మరింతగా ఉధృతమవుతుంది.

★ గాడిదను కట్టిన బండిని ఎక్కినట్లుగా గాని లేదా ఎనుబోతును ఎక్కినట్లుగా గాని కలవస్తే మరణం కలుగుతుంది.

## మరణ కారక స్వప్నాలు (ఇతరం)

★ గూబలు, కుక్కలు ఇవి ముఖానికి ఎదురుగా అరిచినట్లు కలగంటే రెండు నెలల్లో మరణం.

★ భూమి రెండుగా విచ్చుకున్నట్లుగా, తన శరీరం రెండుగా ఖండించబడినట్లుగా, కాళ్లు, విరిగినట్లుగా కలగంటే ఐదు నెలల్లో మరణం కలుగును.

★ నల్లని స్త్రీని అనేకమైన త్రాళ్ళతో బంధించినట్లుగా కలగంటే ఒక్కనెలలోనే మరణం కల్గును.

★ బొగ్గు, బూడిద, వెంట్రుకలు, నీళ్లులేని చెరువు కలలో చూస్తే పది రోజుల్లో మరణం.

★ గాడిద, పంది, పులి, కోతి, ఎలుగ్గొడ్డు, నక్క వంటి వాటిని వాహనంగా చేసుకున్నట్లు కలగంటే త్వరలోనే మరణం ఆసన్నమైనట్లుగా లెక్కించవలసి వుంటుంది.

★ నూనె తలలో సిగనిండా ఎర్రనినూలు పెట్టుకుని దక్షిణ దిక్కువైపు వెళ్తున్నట్లు కలగంటే పక్షం రోజుల్లో మరణం కలుగుతుంది.

* శరీరావయవాలు విరిగినట్లు, ఎప్పుడో మరణించిన (మనకు సంబంధంలేని) వారిని కలలో చూసినచో ఆరునెలల్లో మరణం సంభవం.
* వేగంగా ప్రయాణించే బండిని ఎక్కిన కల; ఇనుపగద చేతబట్టుకుని వికృతాకారుడైన పురుషుడు ఎదురొచ్చిన కల; యమభటుల్ని - యముని చూసినట్లు వచ్చిన కల... ఇవన్నీ మరణకారకమైన స్వప్నాలే!

  (మనస్సంచారానికి హద్దులు లేవు కదా! కనుకనే కలలో - ఇట్టి కలలు రావచ్చుననీ; ఇట్టి కలలు కాకూడదనీ ఏమీ ఉండదు. అయినప్పటికీ అవి ఇచ్చే ఫలితాలు మాత్రమ మారవు)
* ఎర్రటిపూలు ధరించి నవ్వుతూన్న స్త్రీలచేత ఈడ్వబడినట్లుగా, కౌగిలించబడినట్లు గాని కలగంటే రక్త పిత్త రోగాలచేత మృతినొందును.
* ఎర్రని పుష్పాలున్న అరణ్యంలో ప్రవేశించి అడవి మనుషుల ఇళ్ళల్లో ఉన్నట్లు; చీకటి లేక చీకటైన ఇల్లు.. ఇట్టి వాటియందు నివశించినట్లు; కొండలు - మేడలమీద నుంచి క్రింద పడినట్లు; చేపలచేత మింగబడినట్లు జ్వరాదుల వల్ల మృతి పొందు కలలనబడును.
* నెత్తి, రొమ్ము మొ॥ ముఖావయవాల పైన తీగలు మొలిచినట్లు; నూనె అంటుకొన్నట్లు; గడ్డం - మీసం గొరిగించుకున్నట్లు; వాంతులైనట్లు; పాదరక్షలు నడినెత్తిన పడినట్లు; కాకులు-గ్రద్దలు తనచుట్టూ తిరిగినట్లు; పీనుగులు-పిశాచాలు మొదలగునవి దరిచేరినట్లు; అదుముత్రొక్కి అది ఎంతకూ వదలనట్లు; నృత్యగీత వాద్యాలతో కచేరీ చేస్తున్నట్లు; పక్షులు గ్రుడ్లు పెట్టినట్లు; శ్మశానం - బురుద స్థలాల్లో ఉన్నట్లు కలగనడం. అంతు తెలియని రోగబాధను సూచిస్తుంది.
* ప్రేతాలు సారా తాగినట్లు, కుక్కలచేత ఈడ్వబడినట్లు, నత్రాల్లో నివసించుచున్నట్లు వచ్చే కలలు కూడా దీర్ఘవ్యాధిని సూచిస్తాయి.
* తనపై సూర్యకిరణాలు సూటిగా తనని బాధించేలా పడినట్లు; రాళ్ళవాన-ప్రళయం వంటి ప్రభంజనంతో కూడిన వాన వచ్చినట్లు; పాములు తేళ్ళు- జలగలు - పిల్లులు నల్ల విషకీటకాలు చుట్టూ పడివున్నట్లు కనే కలలు కూడా వ్యాధులను సూచించేవే!
* బంగారం వంటి ధాతువులు కలలో దొరకడం అంత క్షేమకరం కాదు.
* తల్లి గర్భంలోకి తాను ప్రవేశించినట్లు కలగనడం క్షయరోగ కారణం.
* పద్మంలో ఇమిడించినట్లు కలగంటే చర్మరోగం వస్తుంది.
* రాక్షసులతో కలిసి నృత్యాలు చేస్తున్న కలగాని - నీళ్ళలో మునుగుతున్నట్లు వచ్చే కలగాని ఉదరరోగాన్ని సూచిస్తుంది.
* దేవతలు, గ్రహాలు... భూమ్మీద పడినట్లుగాని - తాను పెళ్ళిపీఠ పెళ్ళి చేసుకున్నట్లు గాని కలగంటే మూర్ఛరోగం వస్తుంది.

★ దివ్వెగాని, దివిటీగాని మందంగా వెలిగినట్లు – ఎర్రనికళ్ళు, నల్లనిదేహం, ఆయుధ ధారులు తనవైపు వస్తున్నట్లు కలగంటే వాతరోగములు కలుగును.

★ పర్వతం కూలినట్లుగాను; భూకంపం వచ్చినట్లుగాను కలగన్నచో జాతికి శోకం కలిగించేలా ఓ గొప్పనేత మరణం తథ్యం.

★ కలల్లో క్రూరజంతువులు కనిపిస్తే స్వయంగా కన్నబిడ్డలతోనే విరోధం ప్రాప్తిస్తుంది.

★ తన కాళ్ళక్రింద భూమి అదిరినట్లుగా కలగన్నచో కార్యభంగం కలుగును.

★ ఎండుగడ్డి మోపుగాగాని; కుప్పవలె గాని కలలో కన్పించడం కీడును సూచిస్తుంది.



★ ఆవుపేడతో ఇల్లు అలికినట్లుగా కలగంటే త్వరలో ఆ ఇంట్లో చోరీ జరుగుతుంది.

★ కుమ్మరి గుంతల్లో పడినట్లుగా కలగంటే, భర్తపోయిన విధవల పొందు లభిస్తుంది.

★ గోడ, నిచ్చెన, మేడ లేదా ఏదయినా ఎత్తయిన ప్రదేశంపైనుంచి అధోముఖగా పడినట్లు కలవస్తే ఉద్యోగ నాశనం కల్గుతుంది.

## కలల ఫలితాలు ముగించే ముందు

కలలపై ఇంత సమగ్రమైన గ్రంథం ఇటీవలి కాలంలో మేము మాత్రమే వెలువరించ గలిగినందులకు గర్విస్తున్నాము. ఫలితాలు చూసుకోగోరువారు పూర్తిగా కలను గుర్తుంచుకోవాలి. ఏదో కొంతభాగాన్ని, కొద్ది అంశాన్ని గుర్తుంచుకుని ఫలితం కోసం ఈ గ్రంథాన్ని ఆత్రంగా వెదకొద్దు.

విభిన్న దృక్పథాలు, ఎన్నో మనస్తత్వాలు గల ఎందరో మానవులకు వచ్చే కలలన్నీ వివరించగలిగిన సంపూర్ణ స్వప్నశాస్త్రం లిఖించడం ఎవరివల్లా కాని పని. స్థాలీపులాకంగా చాలా కలల్ని వర్గీకరించి మీకు అందుబాటులోకి తీసుకొచ్చాం !

ఏదైనా నిరంతరం మదిలో ఒకే అంశాన్ని గురించి కలవరిస్తూంటే, దానికి సంబంధించినవే కలలొస్తాయని ప్రపంచంలో ఒక నమ్మకం వ్యాప్తిలో వుంది. ఇది కొంతవరకు సత్యమే కాని, కేవలం ఆ కలలో కనిపించినట్లే ఇలలో జరగాలని మాత్రం అనుకోరాదు. ఉదాహరణకు యువతీ యువకులు ప్రేమించుకుంటున్నారు. వారికి పెళ్ళయినట్లు ఆ ఇద్దరిలో ఎవరికి కలవచ్చినా, అలాగే నిజ జీవితంలో జరగాలని లేదు. జరగకూడదనీ లేదు. కానీ... ఆ యువతిగ్గాని, యువకునికి గాని ఏనుగెక్కినట్లుగానో, గ్రుడ్డు తిన్నట్లుగానో కల వచ్చిందనుకోండి! అది పెళ్ళికి దారితీస్తుందని అర్థం! ఈ కలల ఫలితాన్ని అలా అన్వయించుకోండి. ఆనందంగా ఉండండి.



